# మేఘదూతము



మహాకవి, సరస్వతీపుత్ర

పుట్టపర్తి నారాయణాచా



# మేఘదూతము

(గేయకావ్యం)

మహాకవి, సరస్వతీపుత్ర, పద్మశ్రీ

"పుట్టపర్తి"

ప్రకాశకుడు :

'పుట్టపర్తి'

కడప.

# జేజేలు

డా॥ సి. నారాయణ రెడ్డి, M.A.,Ph.D.
(హైదరాబాదు)

ఎవని...పదమ్ములు శివతాం
డవలయాధి రూపమ్ములు;
ఎవని భావమ్ములు సుందర
శివాలాస్య రూపమ్ములు;
అతడు పుట్టపర్తి సూరి
అభినవ కవితా మురారి;
అతని చతుర్ముఖతకు వి
స్మితులు కాని విజ్ఞులేరి!!

ఒకటి...రెండు బాసలు నా
లుకపై తిరుగుట గగనము;
ఒకటి రెండు...కబ్బమ్ములు
పెకలించుట, అబ్బురమ్ము;
పదికి మించు బాసలలో
పసిడి నిగ్గు లేరుకొన్న
పుట్టపర్తి ధిషణకు జే
కొట్టగ మనసాయె నాకు!!

కలితీ కనరాని క్షీర
కళలు చిలుకు అతని పలుకు;
వెలితి యెరుగలేని కడలి
పొలుపు దెలుపు అతని తలపు;
వ్యవహారజ్ఞత అంటని
వైదిక జాతకు డాతడు;
రక్తికి భక్తికి సేతువు
రచియించిన రసికు డతడు.

"సి. నా. రె."

# ముందుమాట

—: ౦ :—

నా మేఘదూతం—ఇది మూడవ ముద్రణ. మొదటి సారి నేనే 'ప్రూఫులు' దిద్దినాను. అందులో తప్పులు కొద్దిగా పడినవి. రెండవ ముద్రణలో—మనము ఒప్పులు వెతక వలసి వచ్చింది. పుస్తకం ఇలా ముద్రించి నన్ను దేశంలో అప్రతిష్ఠపాలు చేసినారే—అని ఎంతో బాధపడినాను. మూడవ ముద్రణ మైనది. నాల్గవ ముద్రణము 'ఆదవేని' సాహిత్యాభిమానులచే వెలువడింది. వారికి నా కృతజ్ఞత.

ఈ మేఘదూతంపైన ఇదివరకే అనుకూల—ప్రతికూల చర్చలెన్నో సాగినవి. నేను దాన్ని గూర్చి వేరే చెప్పవలసినది లేదు.

"పుట్టపర్తి."

తనవంటి మానవుల దైన్యమే సుఖశయ్య
గా - వారి నిట్టూర్పు గాడుపులె చామరలు
గా - వారి కన్నీటఁ గరఁగు దినముల పైని
నిలచి 'మేమూ మానవుల' మంచు గొంతెత్తి
యార్చు ధనికులఁ జూచి యసురులని యన్నాఁడు-
వాఁడు మానవుఁడూ!

అఱజాతి మనుజులకు నధికారములు జూచి,
అధికారమున దళితమైన యెదలను జూచి,
ధనిక రావణుల చేతలఁ జూచి, వారి భో
గేచ్ఛకై యేర్పడిన కీడు లోకము జూచి,
అన్యాయ మన్యాయ మన్యాయ మన్నాఁడు॥ 2

అన్యాయమని పల్కు టన్యాయ మైనదే!
యెదలేని శాసనము బెదరించి గద్దించె;
కుటిల కారాగార కఠిన దంష్ట్రా క్రకచ
దళితుఁడై, బాష్ప సందళితుఁడై, ప్రేయసీ
విరహితుఁడు బ్రదికినాఁ డఱుము చీకఁటులలో॥ 3

వానికీ రక్తమే ప్రవహించు దనువందు,
అన్యాయ మన్న తీవ్రావేశమున గుందు,
కలదోయి వానికిని కన్నీటి మున్నీరు,
కలలన్న వానికిని మొలకెత్తె బులకలే,
బ్రదుకన్న నాశయే-భయమె చావనఁగానె॥ 4

అభినవోద్భిన్నమగు యౌవనము తనువందు,
అనురాగ శైతల్య మలస హాసములందు,
కడలేని గరువమ్ము దుడుకుఁ గుచములయందు,
హృదయ మందమృతమ్ము దుదిలేని-యాశగా-
కలదు వానికి నొక్క గలికి - యింటికి దివ్వె॥ 5

తాళి గట్టిన యట్టి తనకనుల యెదుటనే
తనకు నడ్డమువచ్చు తప్పానకు నధికారి
తరలాక్షి మెయిబట్టి తన్నె డాకాలితో;
తన్నినకు నామె రక్తము గ్రక్కెఁకుప్పఁగా
రక్తంబు తోడనే ప్రాలెఁ గన్నులనీరు॥ 6

పెదవి దాటనె లేదు పలుకఁ దలఁచిన మాట
మలసి చూపొకసారి మగువ వీక్షింప లే
ద, దవదల హృదయంబు గుదియించి కొనలేదు-
'అయ్యో' యటంచు నెయ్యమున – నేడ్వంగ లే
దంతలో – కారలో నంధకారము లందు॥ 7

వాఁడు కారాగార బంధితుం – డపరాధి;
వాఁడీ సమాజంపు పీడకల: చీకటులె
దిన దినం బింతింత తినివేయఁగా – చావ
వలెనంచు శాసనము పలికినది; జవరాలు
ధనికులకు రక్త సంద్రము గన్న యప్సరస॥ 8

అతఁ డొనర్చిన యట్టి యపరాధ మేమంచు
చీకటులు ప్రశ్నించె–చిఱుచుక్క లడిగినవి–
పవలు లాశ్చర్య సంభరితములు వెల్లనై
కొండ కోనలతోడ గుసలు గుసలాడినవి;
ఉత్తరం బెవరిత్తు రున్న యుత్తములందు? 9

జలజలని పురుగులే చెరలాడు సంగటికి,
ములుకులే యైన యంబలికి, నాయువుబట్టి
బ్రదికి యున్నాడు; నిశ్వాసములె పరిధాన
మై, జీవితము నరకమై, కూర్చుఁ జెలికాఁడు
మంటి పాత్రయి, మూల్గు వంటి యాకారమ్ము॥ 10

క్షణమునకు తంబూర సారించు జోరీగ,
ఇంతింతఁగా చీగ టీఁగ రక్తము ద్రాగు,
తలలోన మెదలు పేనులు రాము సేనలై
తనువుపై ధూళి పేరినది; తనువున్నదే!
పాలకులు దిని చివికి పారవేసిన ముట్టై॥ 11

పవలెల్ల నాకలికి పంచ ప్రాణము లూఁగి -
రేలెల్ల ప్రియురాలి బాళి గన్నుల నిల్చి -
యెడబాటు గుందింప నెపుడు పవలగు నంచు -
కడుపు నిప్పులు గ్రుమ్మ కలుగునా నిశియంచు -
బ్రదుకు బరువై - మరణ మెదలేని దేమంచు!॥ 12

నిడుద గన్నుల దాని, నిండుఁ జెక్కుల దాని,
నడుము వడకెడు దాని, నగవు చిత్తడి దాని,
బెడఁగు నడకల దాని, పేర్మి పొడవగు దాని,
దానిమ్మ పూవంటి తళుకుఁ బెదవుల దాని,
తన్వాంగిఁ దలపోసి తలపోసి నిట్టూర్చు॥ 13

"నను గూర్చి యెంతగా నవసెనో! తనువిడచి
తనువు దాల్చితి నంచుఁ గినిసెనో! తానేమి
తనువుతో నున్నదో తరలాక్షి? పాపంబు
శాంతమూగాక! యేకాంతమున జపియించు
చుండునో! నా ప్రేమ నిండు బాష్పములతో
మాలికలనల్లి! 14

'పుట్టువే ధనికులకు బోనమై; నెమ్మదులు
కట్టు కతలై నట్టి కాంతుఁ డొకఁడున్నాడు -
కలలెంత నిజమొ నా కాంతుఁడంత నిజమ్ము!
పోనిమ్మ'టంచు నా పొలఁతి నన్మఱచునో!
మఱచునా! విశ్వంబు మఱఁగి పోవునుగాని
నాదు ప్రియురాలూ! 15

చెలిమి పండఁగ నొక్క చీర దెచ్చితినేమి!
కలిమి యొకనాఁడైన గడపఁ ద్రొక్కిన దేమి!
మురిపంబు దొలుకాడ ముద్దు లాడితినేమి!
కఱకు రక్కసులు నన్గను మాయనిచ్చిరా!
జీవితమె గడచినది చీకటుల చెఱసాల
చెఱసాల చీకటుల 16

తనియదే నను జూచి! వనజముల సైదోడు
లైన గన్నులఁ జూచి, యభిరామమూర్తి! దా
గర్పూర మట్లుగా గరగి కరగును: దాని
విడచి వచ్చిన ఱాతి యెడఁద కిక బరువేమి?
జన్మమే కారలో సాఁగిపోయినగాని
సాఁగి పోవునయేమి! 17

అఱ కడుపునకుఁ దిన్న యాహారమే, నిదుర
గఱకు రాలొత్తి కొను ధరణిపై నే; తల్లి
నేల ప్రేమించుశే నీతి బాహ్యంబైన
నాపడఁతి యగుదాన! నాతి యొక నాఁడైన
నిట్టూర్చెనా! మాఱు బట్టలేని దినాల!
సిగ్గువోవు దినాల! 18

ఆభరణములు లేని దది వింత సోబఁగయ్యె
మల్లె పూవట్లు నా మగువ నవ్విన యపుడు
పట్టపగలే యింటఁ బదివేల దీపాలు!
వెఱ్ఱి బాగులచాన, వెన్నవంటీ మనసు
దులకింప తోఁక చుక్కలవంటి కనులతోఁ
జూచె నా పదివేలు! 19

ఎటులున్నదో నేఁడు గుటి లాక్షుముల యందుఁ
జిటులు కన్నీటితోఁ, బెటెలు హృదయంబుతో,
కవబాసి నట్టి జక్కవ, యిఱ్ఱి విడచిన

హరిణమ్ము, లయలేని యట్టి గానముబోలె,
యేకాంత దుఃఖ సంధ్యాకాంతయునుబోలె -
నేకాంతమును బోలె!'' 20

అని పనవు నిర్భాగ్యుఁ డాఖైది - ప్రతిదినము
కను నీటితో సకియ తనువు రేకలు గీసి -
నిట్టూర్పుతో పూల నిండుగాఁ బూజించి -
వాని యాతన యెడఁద బాధింపఁగా - నంధ
కార పత్రములపై జోరిగ వ్రాసినది -
శోకమే శ్లోకమ్ము. 21

ఇనుప కమ్ములపైన దన మస్తకము వ్రాల్చి
కను మలఁపి చూచెనో గగన రంగమునందు-
వెన్నెలల ముద్దాడి వేయి జగముల మామ
తన సంతసమ్ము - మద్యము ద్రావుచున్నాఁడు
విఱుఁగబడి విఱుఁగబడి వెసనవ్వు చున్నాఁడు
కళద్రవ్వు చున్నాఁడు! 22

కోటిచుక్కల సుకము గోరాడి - యొకరాజు
నీటు కాఁడగుచు చిన్నెలు జూపుచున్నాఁడు -
చంద్రుఁ జూచినతోనె జలదరింపఁగ మనసు
బడుగు దేహము వడక పండ్లు గొరికెను ఖైది;
కొఱుకఁడా! దన బ్రదుకుఁ బెరికికొను వానిపైఁ
క్రూర నిశిచరుపైని 23

ఒక రెండు కిరణములు ముఖముపైఁ బడినవో!
కను వ్రాల్చె నా యినుప కమ్మిపై నపరాధి -
అతని దుఃఖమ్మునకు నదిగూడఁ గఱగెనో!
తన యతివ యంగమ్ము దడవి నటులే యయ్యో;
వాని కన్నీరపుడు వ్రాసె నా కమ్మిపై
బావిదేశ చరిత్ర! 24

౨

తలయెత్తి చూచె నవ్వాఁడూ ప్రియురాలి
తలపోసి యేడ్చికొన్నాఁడూ –
తలపోసి తలపోసి – తలఁపు డస్సిన దేమొ!
తలఁపు డయ్యానెలేదు – తనువు డస్సెనెగాని!! 1

గగనమున కెగఁజూచినాఁడూ తనకాంత
కప్పు కొప్పును దలఁచినాఁడూ –
చంద్రికా పరిరంభ సమ్మోద రూషితుఁడు
చంద్రుఁడస్తంగతుఁడు – శోక గీతికలందె! 2

కుసుమ భరవాసనలు చిమ్మా నల్గడల
విసవిసగ గడచె పవనుండూ –
నడచు గాలులు సకియ నుడుల నందించెనో!
తడవికొని తనచుట్టు – తలయెత్తెనా ఖైది 3

మత్త గజ గమనంబు నోరసీ మదిరాక్షి
మృదు గమనముల శిక్షఁ బెరసీ –
అలఁత చన్నులపైని దులకించు జవరాలి
కలఁత నిద్దుర తేనె కల వోలెఁ జిత్రముగ 4

నడతెంచె నపుడు గగనానా యొక మేఘు
మడు గడుగునందు నందానా –
కనులలో రతనాల కాంతులే యెగజిమ్మ
విరియు పడగలతోడి సర్పరాజునుబోలె 5

చనుదెంచె మింటి మార్గానా జలధరము
తనువు మఱచిన సంభ్రమానా –
సర్వతోముఖమైన సంస్కారమును గల్గి
సాఁగి పోయెడునట్టి సత్కవిత్వమువోలె 6

అలసముగ వచ్చెవ్యోమానా యింద్రునకు
నద్దాల మేడ చందానా -
తరుణ విరహాముగాల్చు దంపతుల నూ రార్ప
మరుఁడు బంపిన చిన్నిమరులు పడవయుఁబోలె 7

అలరు చేతెంచె నభ్రానా శచిదేవి
యచ్చంపు లేనగవు సోనా -
ద్యునదీ సరస్సు నందోల లాడెడునట్టి
వనజాక్షిరంభదగు వలిపెంపుఁ బైటవోలె 8

తడఁబడుచు వచ్చె సాంపానా యొయ్యారి
జడవోలె - చలువ తలకోనా -
పాల సంద్రపు జిడ్డు పరిమళించెడునట్టి
పరమ పదనాథు నిబ్బరపు టూరుపువోలె 9

ఆ మేఘరాజు తెరువరసీ చిత్తంబు
గామినీ విరహాంబులోరసీ -
గళ సంధిలోననే గవ్వలను కెదికినటు
గన్నీటి జాలురలి - గల గల మటంచనఁగ 10

పలికె నా ఖైది "శుభ తేజా! కాసంత
నిలుమోయి! ఓ జలదరాజా!
చిన్నిచుక్కల చెలువు జిలికించు ప్రియురాలు
ఉన్నదో! లేదో! యీ యుర్విపై నడిగేను 11

కుటజముల నెటుఁదెత్తునోయీ! పూజింప
గటకటా! యిది చెఱగదోయీ!
ప్రత్యగ్ర కుటజములవంటి పల్కులతోనె
స్వాగతం బిచ్చెను సవరించికోవోయి! 12

నీ వాలకము జూఁడగానే నాకేమొ
నీ వంగడము దోచెతోనే

భువన విదితంబులగు పుష్కలా వర్తముల
బుడుతండవంచుఁ దలపోతునే నాత్మలో 13

కదలేవురా! మేఘరాజా నాకండ్ల
మెదలు నీరే చినుకులోజా –
కోర్కె యొక్కటి నిన్ను గోరి కొందునుగాని
తీర్తువో! తీర్పవో! తీరికెగ వినవోయి!! 14

మనుజులను నే గోరలేనూ శిలలైన
మనసులకు నే పాడలేనూ –
ఈ నెఱుగనట్టి 'జీసస్సు' రక్తముగ్రోలి
పాశవమ్ముగ మార్చె–భూమినే యీ జాతి! 15

నా సఖుఁడ! విన్నావో! కావో! ఆ సోక్ర
టీసు జంపిన గాధ లేవో!
నశ్వరముగానట్టి విశ్వమానవమైత్రి
బోధ సేసినయట్టి బుద్ధుఁడే మయ్యెనో!! 16

చీకటింటిని బోలునట్టి రాజపశు
జీవితమునకు నెలుఁగుబట్టి –
ఒక్కొక్క పద్యమే – యొక్కొక్క దయ్యమై
చిక్కి స్రుక్కిగతించె నక్కటా! ఫిరదాసి 17

ఆ కథలు విన్నావో! లేదో! బాగ్దాదు
చీకటులు వినిపింప లేదో!
ఉబుసు పోకకు నైన యొకసారి వినవోయి!
గుబులు గుబులై నిండు గుండె నెత్తురులాచు 18

పోదువో! యేమొ! వగఁకాడా! నీ ప్రొద్దు
పోవునంచని నీదు జాడా –
స్వార్థంబు లీ మర్త్య జాతిలో నున్నంత
పెరుగ లేదింక మీ తరములం దనుకొందు 19

ఊరమ్ముకొని వచ్చినావా! నవజలద!
యొక్కింత సేపాగ లేవా!
విద్యుల్లతాంగి నీ వెనువెంటనే యుండె
బిగియాఱగా ముద్దువెట్టుకో! మనసాఱ 20

నా కున్నదొక్క ప్రియురాలూ! నీ మెఱపు
పోకలే - చక్కందనాలూ -
అయిన నేమీ చూడు, మాత్మలో విరహంబు
చెయిద మేమీ లేక - చెరసాల మరణంబు 21

'ధనికవాదము' గాదటనఁగా చీకటుల
దన్ని త్రోసిరి బ్రదుకు చనఁగా
కడుపు గాలిన బీద కన్నీటితో నేడు
జలధులే పొంగెత్తి - జగతు లింకక పోవు'' 22

కరుణ బుట్టిన దేమొ తనకూ జలదమ్ము
గాలు గదలుపదు ముందునకూ -
మదవతీ రతి సమయ మణిత మధురమ్ముగా
మృదు మృదంగ ధ్వాన మేదురమ్ముగ మ్రోసె 23

ఆ గర్జ తా నాలకించీ సమ్మతిగ
నంకించి - సుంత యోచించీ
అందదుకులైనట్టి - డెందమ్ము నూల్కొలిపి
అపరాధి పల్కె శోకాత్మకము కావ్యమ్ము- 24

—:o:—

3

జలదమా! వినవోయి
పలికేను నీ తెరువు
లిటనుండి మెల మెల్ల సాఁగీ పర్వతపు
కటకముల నుయ్యాలలూఁగీ చెంచితల
దర నఖ క్షతగుచ్ఛ పరిణ తాంకములందు
సరిగాక నమృత సేచనచేసి – పోవోయి ! 1

మంద సుందరముగా
మరుతుండు నీతోడ
పయనంబు దూగించి రాగా చాతకము
వామగతి గరువముగఁబోగా- కనుదన్ను
నిను బలాకలుజూచి – ననుచు సంతానేచ్ఛ
గనులఁ గన్పడ, గుంపు లేగట్టు! పొమ్మోయి. 2

దివసములు గణియించి
తీరులను గుణియించి
తీరికయె లేకున్న దానీ మఱదలిని
దేర్పుమా! గారుణ్యమూనీ కుసుమంబు
వలెనె యప్పుడె రాలు బలహీనమైన యెద
నిలుపు నాశాబంధములు వృంతసమములై 3

చలువ నీడలతోడఁ
గులుకు నీ తెరువరసి
మగలపై హృదయములుబారీ సిగ్గు తెర
లగలి నిన్ జూతురొకసారీ అలకంబు
తెగఁజోపి – పింఛముల నిగనిగలు మఱపించు
తెగల కన్నుల చూపు మొగిలు నీ పైఁబరపి 4

మదన రథచక్రమ్ము
మరపించు కటితోడ
నీటుగుల్కుచు నున్న వారీ నటుసేసె
నీ సమాజము మహామారీ వారి యొ
య్యారములతో నీ ప్రయాణంబు మఱచేవు
నేరుగాపోర! నా గారాము చెఱచేవు 5

స్తన గుళుచ్ఛాలపైఁ
దట్టాడ చెమరింత
రాళ్లు మోయుచునున్న వారీ యౌవనము
బీళ్ళ చంద్రికలైన వారీ కడుపునకుఁ
గాయ మమ్మినయట్టి కనకాంగులకు సుంత
తోయదానంబిమ్ము – తోయదమ! నీవైన 6

నిండుటాకలి దూఁయ
మండుటెండలు గాయ
నడ పీనుగులవోలె నిలచీ శిరసుపై
గడు ధూళియును దుమ్ముబెరసీ కనపడెడు
హరిజనులపై సుంతయాదరము నీవైన
పరపరా! వారి నోదార్చువారే లేరు 7

అటుచూడవోయి! య
క్కటికమూనఁగదోయి!
కంకరను గొట్టుచున్నాఁడూ! పొట్టలో
డొక్కలేర్పడు బిల్లవాఁడూ! వాని కను
గ్రుడ్లలో కన్నీరు – కొంచెముగ దిగజారె
కాయగాచిన వాని కరమె గాల్చుచునుండె– 8

వాఁడె కమ్మరిచూడు –
దౌర్భాగ్యముల గూడు

కొలిమి నూదుచునున్న వాఁడూ! తనపొట్ట
కోసమై నవయుచున్నాడూ! అల్లంత
దూరాన నదెవాని తొయ్యలిని గనుగొమ్ము
జీరాడు చనులతో – చీరనోచనిచాన! 9

తెలినవ్వు లందముల
జిలికింప మొగముపై
పాలకై యేడ్చుచున్నాఁడూ బుడతంతు
పట్టువలకెత్తి కొన్నాడూ ఆ తల్లి
చనుబాల నిచ్చునో! దన యురము జీల్చి ర
క్తంబులే ద్రాపునో! ధనికు లే మెఱుగుదురు? 10

గిలుకు మట్టెలపాట
లొలికించి చనుదెంచు
నదిగదిగో! చాకితను చూడూ తెలినీటి
యాఘుళము చూపులకు సూడు యింతైన
గట్టుకొనఁగా జెన్నుగల బట్టయే లేదు
కడుపు బిగువే లేదు – కటిని బిగువే గాని 11

రాజ హంసల నాడు
రాజ హంసలు గలవు
రాగమున నిను వెంబడింపా నీగర్జ
శ్రవణ మోహన మాలకింపా యిక నేఁడు
క్షామపీడితమైన గాత్రములు వణకాడ
నీ మొగము వీక్షింత్రు నీరదమ! తెనుఁగుప్రజ 12

పుట్ట గొడుగులు కొల్ల
బుట్టు నంచని నిన్ను
భూమాత యాశించునేమో! గర్జవిను
పుణ్యమునకై గోరునేమో కోరదుర

కట్టఁబట్టయుఁ దిండి గతి లేని దేశాన
పుట్ట గొడుగులుగాక - బురుషు లెవరున్నారు! 13

కాంత లతికాంతర ని
తాంత భృంగీచయము
కుంతలంబును జూడవోయీ! భూకాంత
కుంతలోపమ దేశమోయీ! రతితాంత

కాంతా నఖాంతర్లతాంతా హజములై-ది
గంతాల కొకనాఁడు కమ్మవీణెలు మ్రోసె 14

తుంగభద్రాసము
త్తుంగ వీచీఘటా
గంభీర ఘుమ ఘుమల యందూ- కవిసార్వ
భౌము జయములు పల్కునందూ- అచ్చోట

నిలిచివర్షింపరా! జలదమా! నీనీరు
తులలేని తుంగమ్మ ద్రాక్షారసముసేయు 15

తెలుఁగు చిన్నాదేవి
లలిత పదములలోని
పారాణి చిన్నములుజూచీ దయ్యములు
పారాడు నంతిపురిజూచీ యేడ్చికొను

కోటకొమ్మలపైన గూర్చుందువో యేమొ!
నిట్టూర్పు సెగలతో - నీవె పొగలయ్యేవు 16

అదిగదిగో! గదలు చు
న్నది నీడవలె నొకటి
ఆదరం బంకించిచూడూ తిమ్మరుసు
నన్నదో! కన్నీటిఁగూడూ ఉపకార

మపకారమై - బ్రదుకు హతమార్చె నొకరాజు
అతఁడు సామాన్యుఁడా! ఆంధ్రజాతికి పొగరు- 17

కన్నడపుఁ బడఁతుకల
గరువంపుఁ జూపులకు
మెఱపునేమఱచి పోయ్యేవూ 'హంపి' పోలి
మేరలే చుట్టిచుట్టేవూ కొండవీ
డున్నదోయీముందు – నిన్ను నాహ్వానించు
గ్రిక్కిరియు చనులుగల రెడ్డి కాంతలఁ జూపి

పంపా విరూపాక్షు
ప్రార్థించి కొమ్మోయి!
పయనంబు సాఁగనిమ్మంచూ నీగర్జ
ఢక్కఁగాఁచేసి కొమ్మంచూ వానిఘా
లాతుంపు[1] వచ్చెనే యాంధ్రరాజ్యముగాల్చె
యతఁడన్న నాకు భయ, మనురాగమునకన్న

క్రొత్తావు లందించుఁ
గొండ మల్లెల పూలు
ఋశ్య మూకమునందు నీకూ వానిసని
కాలస్యమును జేయవాకూ నెరజాణ
'తుంగమ్మ'తో కొంతఁ దోబూచు లాడుకొని
తొందరగఁ జనవలయుఁ దోయదమ! మున్ముందు

గగనాన పైకెగిరి
మొగము మలపినతోనె
గనుపించుఁ బెనుగొండ' నీకూ భట్టుకవి
కవిత లల్లిన వింతవాగూ తిర్మలుని
యశము రుచిమాఱుఁ గలదంచుఁ గొలఁదులుబల్కు
దశచెడిన దాడిమీ ద్రాక్షా లతాలయము

1. కన్నడమునందు 'సర్వజ్ఞుఁడు' మహాకవి. అతఁడు 'శివద్వేషము'చే 'విజయ సామ్రాజ్యము' బాడగునని చెప్పెను.

మరికొంత పై నేగి
మలఁగి చూచినదోఁచు
శేషాచలంబు న వ జ ల దా! శ్రీ వేంక
టేశ్వరుని దయకుఁ దుదిగలదా! ఆపర్వ
తాన గనిపించెదరు ద్రవిడాంగనలు నీకు
తారుణ్య చాతుర్య పారమ్య తను హృదులు 22

'జగతాపి' దుర్గంబు[1]
శైలాల వాలంబు
దక్షిణావర్త శంఖంబూ[2] అద్దాని
వీక్షింపకుంట దోషంబూ నిరతంబు
మబ్బు కన్నెలు దాని మగతనంబును వలచి
గుబ్బతిలు కోరికల కొసరి సంశ్లేషించు- 23

'కళసాపురము' లోని[3]
కదళీ వనాంతర
ద్రాక్షా రసంబులకు వలచీ శ్రీనాథ
కవిరాజు మైమత్తు లెనసీ కర్ణాట
తరుణీ[4] శ్రవో భాసితాటంక ధళ ధళలఁ
దనుపారి - కన్నడమె[5] - తనకైత పొమ్మనెను. 24

---

1. గుత్తి. 2. బుక్కరాయల శాసనములలోనిది యిట్లు వర్ణితము.
3. కళసాపుర ప్రాంత కదళీవనాంతర ద్రాక్షాలతాఫల స్తబకములకు (శ్రీనాథుఁడు)
4. కర్ణాటకామినీ కర్ణహాటకరత్న తాటంకయుగ ధాళధళ్యములకు (శ్రీనాథ)
5. నాకవిత్వంబు నిజము కర్ణాటభాష (శ్రీనాథ)

ఆ ‘కుమారవ్యాసు’[1]
ననవద్య కవితలకు
నాధారమైనట్టి వా నీ
నారాయణుని జూచి కానీ
వాఙ్మయాంతకులైనవారి పోకలెగాని
సారస్వతాన భాషా భేదమే లేదు

ముందు గనిపించు నీ
డెందంబు గదలించు
‘తళ్ళికోట’ రణంపుబీడూ
కులము మాల్చినది సుడుగాడూ
సులతాను రామరాయల డొక్కఁబొడిచి య
చ్చులపుఁ గత్తికి, మైలదొలిచె నీ కృష్ణలో

కుడిచి కూర్చొన లేక
కడుదుర్మదం బెనసి
యాబోతులై నిల్చినారూ
నాప్రక్క నీప్రక్కవారూ
యీ దేశ చరితలో నెంతపని జేసెరా!
ప్రతిపదంబున, వేయిపారె రక్తనదాలు

ఏకాంతమునయందు
శోకగీతికలతో
బారుచుండెడి ‘కృష్ణ’ జూడూ
వినవోయి! యాతల్లిగోడూ!
బహునాయకత్వమ్ము బట్టినది రోగమ్ము
నాఁడు నేఁడునుగా దనాదిగా నన్నదో!

---

1. కుమారవ్యాసుఁడు కర్ణాటభారతకవి. గదుగు వీరనారాయణోపాసకుఁడు.

కళల నెలవగుకృష్ణ
చెలియలగు 'తుంగమ్మ'
యేభేద భావమ్ము లేదూ క్షత్రియుల
కెందుకో! వానికై వాదూ మచ్చరము
బెనఁగి, మీసము నుల్పికొని, కోసికొన్నారు
తనయ దారాబంధుతతి, మహాశూరులై 29

'మతమంట' మతయొక్క
మారియై పట్టినది
మతిలేని రాజవర్గంబూ వారిస
మ్మతికిఁ జచ్చినది, సైన్యంబూ హృదయాన
గరుణకరవై యున్న నరుల, కెక్కడి మతము!
పరపీడనమె, దేశచరితలకు మూలంబు 30

హరిహరుఁడు బుక్కఁడీ
ధరణిపై జన్మించి
యాంధ్ర రాజ్యము నిల్పినారూ మాని వి
ద్యారణ్య మనసుఁ గొన్నారూ తరువాతి
ధరణి పాలురు భోగదాసులై తపముచెడి
పరుల చేతికిఁ జిక్కి, పాలార్చిరీ చరిత – 31

గడచి పోయిన దింక
నుడివి లాభంబులే
దటఁగొంత వర్షింపు మోయీ! నీవు నా
యాసంబు దీర్చుకో మోయీ! ఆ మృత్తి
కారాశి శయనించి వీరులెందఱుగలరో!
వారెన్ని నాళ్లుగా నోరెండియున్నారో! 32

౪

అచటచట నెత్తైన
యట్టి నెత్తములందు
నల్లంత కాలూనుకొంచూ నసిగల్గు
నాహారమును దీసికొంచూ నీ రాక
కెలమి కన్నుల మోదజలముతోఁ బురివిప్పి
కులకు నెమళుల బ్రీతి, కుశలంబు బ్రశ్నించి- 1

ముందు కేగుము సఖుఁడ!
మంద సుందరముగా
హరిణాంగనలఁ జూచుకొనుచూ వానివలి
తాంగముల జిగి మెచ్చుకొనుచూ తన్నేత్ర
శబల శారములైన చూపు లాశలఁబర్వ
జలదాంగన లటంచు సంశయం పడకుండ- 2

ఉరము లగలించు బి
త్తరపుఁ గన్నులవాని
హరిణముల గణము వీక్షించీ సవతి మ
చ్చరము హృదయమ్మున గలించీ నీమెఱపు
కానిపోనివి చెప్పి కలచునో! నవమేఘ!
కాదు లే! విద్యుత్తు కడుదొడ్డ యిల్లాలు 3

రురుపుంగవులు తరుణ
హరిణ తరుణులఁ డాసి
కనులలోఁ గన్నులానించీ స్నేహంబు
నినుపారఁగా బుజ్జగించీ శృంగాగ్ర
ములను గోకెడువేళ, జలజలని చినుకులై
జళికించి - రసభంగ శప్తుండవయ్యేవు! 4

చకిత చకితంబుగా
వికచ దృష్టులుగల్గు
ముగ్ధ సిద్ధాంగనలు లేరూ      నీరూపు
మోహంబుతోఁ జూచువారూ      సరసంబు
లైనవి చుళములైన గానిపించునో! లేదో!
అంబుదా! నీ త్రోవ కందములు జిగురింప – 5

చిలుప చిలుపని మురువు
జిలుకునీ తడివలపు
సోకెనో లేదో! భూదేవి      మెయినిండ
బ్రాకఁగా నత్తరుల తావి      మొగ్గలను
దొడిగి యున్నట్టి కందళియన్న తొడవుఁదొడి
యడుగడుగునందు, నిన్నభిసరించునటోయి! 6

అఱకొఱగఁ దలసూపి
నట్టి కింజల్కముల
హరిత కపిశములైనవానీ      నీపముల
'నదియొక్క పొగరుగా'నానీ      భూమిపై
చక్కరలు గొట్టేటి సారంగ యువబృంద
'మదెవచ్చెఁ దోయదం'బఁని, ప్రజకుఁ దెలిపేని 7

ఎన్నాళ్ల కెన్నాళ్ల
కీయింద్రుని ధనుస్సు
గనుపించినది మింటియందూ      రతనాల
తనువు జిల్కంగాఁ బసందూ      ఒకసారి
దానిచెంగట నిల్వరా! నీదు మెయిజూచి
బర్హంబుదాల్చు గోపాలునకుఁ బోల్చెను 8

తమ సేద్యమునకు నీ
దయయె యాధారమ్ము
గనుక, తెల్లని కనులువిప్పీ తనివోక
నిను ద్రావెదరు మత్తుగప్పీ ఆ కాపు
జవరాండ్ర లేవలపు సవరించియేగరా!
ప్రణయయాచ్ఞా భంగభారమ్ము ఘోరమ్ము

పల్లె పట్టులయందుఁ
బయనించు సమయాల
పాలేరువాఁడు గన్పించూ మిడిమెండ
బ్రద్దలుగఁగొట్టి పండించూ వాడెంత
గష్టించినా మిరపకారమే సంగటికి
కలఁడోయి ఖామ్దందు, కలిమి వానికిజెందు- 10

కనులలోఁ గన్నీరు
గాల్వగట్టగ గడియ
తీరికయె లేకున్న జీవీ నాగేటి
చారలే బ్రదుకైనవాపీ వృషభరా
జవ్వాని భాష నీ కర్థమానో, యేమొ!
నెవ్వగల నుడుపరా! నీ నీడగొడుగులై 11

పడఁతి జడవంటి - నీ
యొడలి కాంతిని జూచి
పొలములను బనిచేయువారూ చెలియ కా
గిలికినై - వాచిపొయ్యేరూ బుడుతండ్రు
వచ్చెవచ్చెను వానవల్లప్పలని నిన్ను
మెచ్చికొని, గేకిసలు, మెయిబొంగికొట్టేదు! 12

మరుఁడనెడు రారాజు
దురుసు టేనుఁగు కుంభ

ములకు నైదోడు లైనట్టి కుచయుగము
దుసికిళ్ళుగా సొబఁగుగట్టి పొలమందు
సంచరించెడు వానిసంగటిని గొనిపోవు
సకియలను, సరకు సేయక, నీవు పొయ్యేవు 13

ఇంపు పాటలతోడ
గుంపు గుంపులుగట్టి
వచ్చేరు నీకెదురుగా గా గడ్డిమో
పులు-శిరస్సుల కందములుగా చెన్నుగల
చెలియండ్రు - విడచివచ్చిన శిశువులను దలఁచి
జలజల మటంచనఁగ, చనుల వెచ్చనిపాలు 14

‘మామ’ యని ‘బావ’ యని
మనసు లోతులఁదడవు
వావి వరుసల నెన్నికొనిచూ బురుషులును
జవరాండ్రు నున్గాడికొనుచూ పల్లెప
ట్టులను బ్రదికెడు జనులఁదలచేవురా! వేఱు,
పల్లెపట్టులలోని బ్రదుకు తీరే వేఱు 15

చిగురు జొంపములందు
మగలు మగువలుగూడి
మగసేత లాడికొన్నారూ ఆ కాళి
దాసు ప్రపంచంబు వారూ నేడట్టి
బ్రణయంబు లెక్కడివి! వనదమా! నీబాట
సాగులే తొందలేక, నా గోము కొరబోక, 16

‘రేనాడు’ నిజముగా
రేనాఁడె తోయదా!
నిలిచి వర్షింపు మొకమాటూ కష్టాల
చెలమ లాజనులు గాదోటూ! ఒకరొకరు

బాడిచికొన భూమిపై బడెడు రక్తమెగాని
యరుదుగా మేఘజల మానేలపైఁబడును 17

ప్రతి పల్లెలోనీకుఁ
బాళెగానిది కోట
పాళెగాఁడైనట్టి రెడ్డీ గనుపించు
ప్రజల బ్రదుకుల సౌఖ్యమడ్డీ రచ్చబం
డలపై నినేఁడు 'పంచాయతులు' లేవురా
'పులిజీతములు' రంగు పేకలాటలెగాని 18

పులుమేసి—పొగరు మే
నులుదూసి—చలియించు
వృషభరాజంబు లేనాఁడో గల్గెనట
పల్లెపట్టులయందు—నేఁడో! జనులకే
గడుపారఁగాఁద్రావ గంజియే గరవయ్యె
బడుగు మేనుల తొడుకు—పొలము కాపులుగూడ 19

వడ్డి రూకలఁ గడుపు
లడ్డంబు బెరుగ నా
పడ్డలై గనుపింత్రు నీకూ ధనులు ద
న్ముఖ దర్శనము సేయవాకూ— సరివారి
సౌఖ్యంపు పుర్రెలో—జగతి సేమముద్రావు
గడుదుష్టులగు వింత కాపాలికులువారు— 20

వరుస లేగట్టి నీ
వెంటవచ్చెడునట్టి
కొంగలను జూపించుకొనుచూ మధుపరి
ష్వంగ సౌఖ్యంబాదికొనుచూ ప్రియలతో
బాలమందుఁదిరుగు గాపులకోడెగాండ్రు - నీ
యుపకారమెంచి - నీ యున్నతిని బొగడేరు 21

వర్షించితే నీవు
పంట కలకలలాడి
బొట్టనిండెడునంచు జనమూ  కనుల నీ
రుట్టగాఁ జూచు నీమునుమూ  దుర్భ్రాంతి
గాక—బీదలకొక్కకడి జిక్కునా యేమి!
పంటతో ధనవంతునింటి సంచులునిండు  22

పడిన కోటల వెంట
చెడిన బురుజులఁగంట
జూచుచును పోవోయిజలదా!  పోయినది
ప్రాతకాలం బింకగలదా!  తుదిలేని
ప్రకృతిపుస్తకమందు దిరుగవేసిన యాకు
మరలిచూడఁడు, కాలపురుషుండు-దురుసుండు  23

అచటచట గనుపించు
నభ్రంకషమ్ములగు
గోపురమ్ముల గుడులు నీకూ  నేడచటఁ
గాపురము గబ్బిలమ్ములకూ  మాన్యములు
ధర్మకర్తలయిండ్ల ధాన్యంబులను గొల్చి
యలసినవి-దేవునకుఁబలుకు బలమే లేదు.  24

ఒక్క ప్రాణముమాత్ర
దక్కువగు శిల్పాలు
గుడులలోఁ గనుపించునోయీ!  రసమూర్తి
వానిజూడక పోవకోయీ!  గన్నులీ
మనుజులకు లేవు పో!  తనియవానినిజూచి
వనదమా! నీ కేమివచ్చె దౌర్భాగ్యంబు!  25

పలికించు చుండునొక
నెలంత వీణియమీటి

జళికించు నొక తెగను సూటీ    వేరొక తె
గులికించువలఁపు మది దాటీ    నవజలద!
వారితో దాక్షిణ్యాభావంబు గుదిరి నా
గూర్మిసౌదామనిని గుస్తరింప నెవలెను 26
పదిమందిఁ గూల్చితన
కధికారమును గోరు
కపటులగు నాయకులగుంపూ    గతిలేని
సత్కవుల కన్నీటిముంపూ    యింటింట
గలవు గద్దింపులేగాని ‘రేనాటి’లో
మరియెన్న దగినదే మాధుర్యమీనాఁడు! 27
ఆయహోబలనాథు
నాదరింపక పోవ
భక్తికే గాదయ్యలోటూ    సౌందర్య
రక్తికినిగల్లు మొగచాటూ    వాయుపూ
రితవేణునాద మూర్ఛిత మార్గములయందు
తతనితంబాభోగ ధవలాక్షు లుండెదరు 28
పడగలను విరియించి
పారాడు నాగక
న్యకలతో – నిబిడాటవులతో    కలముగా
స్వనియించు పుంస్కోకిలలతో    నిప్పపూ
వుల తావి నసుచు గాలులతోడ గరుడాద్రి
చెలువమే రూపెత్తి చేరునెదురుగవచ్చి 29
నవనారసింహులే
నాటివారో! గాని
కొలువుదీరిచి యున్న వారూ    చెంచితల
కొసరు ప్రాయము వలచినారూ    ఉక్కుకం
బముపైని – నీ ప్రయాణము వేళఁ–గన్పించు
పాతాళలోకంబు బాటయూ నొకలోయ– 30

చెంచులక్ష్మికి నిచట
సేవలొసఁగెను స్వామిఁ
ఆదిలక్ష్మికి నీత లా నా    నునుముద్దు
లందించెఁ గుసుమతల్పానా    యనివలపు
జిలుక మాటాడికొను చెంచతల జగమెఱుగ
నట్టి మాటలకు – సూకొట్ట కేపొయ్యేవు    31

పచ్చితేనెలు – జున్ను
పాలు – రురుమాంసంబు
చాఱపప్పును గాన్కలొసఁగీ    నరసింగ!
సాకరా! మమ్మంచుఁ జెలఁగీ    యడవిలో
దిరుగు కోయల మేను బురుడించునో! లేదా!
నీరదా! నీ తళుకు! నీవె సరిపోల్చుకో!    32

క్షితిదేవి యావులిం
చినయట్లు గనుపట్టు
లోతైన లోయలను దాటీ    రసమొలికి
సెలకన్నియలకుఁ గన్గిటీ    పయనింపు
ముదయాద్రి మొగముగా జ్యోతిర్లతలు నిన్ను
ముదముతోఁ దిలకింప–మోహనతనుండగుచు    33

గోచరంబగు నెదుట
గోపురం బొక్కటది
'మారికాపుర' మోయిజలదా!    చెన్నకే
శవుని కరుణకు నవధి గలదా!    గణ్యాప
ణ్యాంగనా కుచపరిష్వంగ సంగతి గల్గి
సంగీతవీథిలో సంచరించును వాఁడు    34

సలకతిమ్మఁడునాఁడు[1]
సామ్రాజ్య దీపమ్ము
నార్పంగబూన హతమార్చి అళియరా
ముడు–ధారణికి సుఖము జేర్చి పాలించె
నంట! శిలపైని యాయక్కరము లామేటి
బంటువిక్రమగీతిఁ బలునట! చదువుకో!

ఒక రాచకన్నె – నా
యకుఁడు దన్వీడఁగా
దన విరహ మిట్టిదని జూపా గట్టించె
జెఱువు త్యాగమ్ము బ్రేరేపా చెలికాఁడ!
యెవ్వరనుకొంటివా యింతి! గజపతి బిడ్డ
నెవ్వగల నీలముల నిండించె నీచెఱువు

కొండలకుఁ గొండలకుఁ
గ్రొత్త చుట్టరికమ్ము
జేసి కట్టించినది చెఱువూ ఆ రాచ
కోడలికిఁ దక్కినది పరువూ రేఁబవలు
మన్ను మోసినవారి మాటయే లేదురా!
వన్నెకాఁడా! ద్రవిణవంతుల దిదేవరుస

వారు పణ్యాంగనలు
వచ్చేరు – నీ కెదురు
నీవు నున్నాతిముడిచేవూ కోపాన
గర్జించి బెదరఁగొట్టేవూ కూటికై
తనువమ్మి కొన్నారు–తినతిండియేయున్న
వారు పాతివ్రత్య భావంబు బలికేరు

1. మాచర్ల–పుర చెన్నకేసవుని యాలయమున నళియరాముడు సలకఁ తిమ్మని వధించినట్లు శాసనము గలదు.

వ్యభిచార దోషమ్ము
నాకట్ట వలెనంచు
నీతులను బల్కేరుగానీ నాయకులు
వారి కొంటకివ్వరేగానీ శుష్క ధ
ర్మార్థములతో దేశ మగడు బట్టినదోయి
అర్థమే సర్వమై - స్వార్థమ్ము బెరిగినది 39

త్వరగ బోపొమ్ము నా
హరిణాక్షి వేంతబడును
జూడవలయున దింకగలదూ రే నాటి
సీమలోం దామసము వలదూ గడచిపో
యిన గొప్పలను జెప్పికొని గర్వపడువారె!
మనము లేనట్టి యీ ప్రమాని బొమ్మల కేమి! 40

✂

మల్లికార్జున దేవ
మల్లికా నిభ కటా
క్షాంచలంబుల జలదరించీ భ్రమరాంబ
ఇంచునవ్వులం బల్లవించీ శ్రీశైల
మెదుటం గన్పడు నీకు, మదవతీమృదిత కి
న్నరులతో-హరులతో-దరులతో సొబంగాని- 1

హైమవతి, దన చనుల
కనుగలంబై నట్టి
బటువైన ఫలములను గలిగి తన పెదవి
బోలు నవ కిసలములు గలిగీ తన కింపు
గలిగించు బిల్వవన సలలితాధ్వములందు
జలజారి ముకుటుతో సంచరించుచునుండు 2

ఆ వేళ గమనించి
అంబుదమ! తమకించి
కురువవలె నమృతంబు సుమా! నీ గర్జ
రణియించి 'జతులు' పైగ్రమ్మ పుట్టువే
సార్థకంబయి, వచ్చు జన్మంబులో నీవు
భర్గునకు ధరియింప – పరిధానమయ్యేవు 3

ఆ శిలాదుని తపసు
జోసికట్టిన తావు;
నందీశ్వరుఁడు హుంకరించీ అంకించి
నట్టి భాగమ్ము సేవించీ పాల్కురికి
సోమనాథుని కవితతో మచ్చరించు ప్ర
సూనవాసనలాని – సాగియంగవలె నీవు 4

నట్టి వేరులపైని
దొట్టిగల గలమంచు
నినదించు సెలకన్నె గుంపూ ద్రోవలో
నీ మెదకు వలపుఁ జలిముంపూ దివినుండి
యవనికిని దిగినట్టి యప్సరోనికరంబు
భావబంధురముగాఁ బలికించి పోవోయి! 5

చెంపలఁ బ్రకాశించు
జేగురుందిరికెలై
సింగిణీలను జేతఁ బట్టీ చెంచితలు
చరియింత్రు జిగిరూపుగట్టీ వారిని
స్తారకటి భాగములఁ బారింపకుర చూపు;
వారుశివ దీక్షితలు, వహ్నికీలల చెలులు 6

అడవి మామిడులతో
నందంబు లెగఁబోయు
లోతు దెలియని లోయలందూ మానినీ
చేతోని భాధ్వమ్ములందూ వెల్లనగు
కడఁగనుల జలముతో-గేకారవమ్ముతో
స్వాగతము బలికేని బర్హిణమ్ములు నీకు 7

లలితాంగి కొసపెదవిఁ
బొలయులే నగవువలె
సూచి భిన్నము లైన యట్టీ గేదగుల
నాచి - కొప్పులయందు బెట్టీ మృగవధా
జీవతరుణులు మిన్నుజూచెదరు - చూపులే
జలదమా! నవనవోత్పల దామమగు నీకు- 8

అలస వలితములైన
యట్టి తరగలగుంపు
బొమముడుల సోయగముబోలీ తనరార
స్తనిత సుభగమ్ముగా వ్రాలీ పెదవివలె
పయముగ్రోలర సఖుఁడ! బాతాళగంగలో
నయవిదుం డెవ్వాఁడు నాతి దొరకిన దొలఁగు? 9

పశోక మెగచెనో !
యేశాపమాచెనో!
శిలఁగాఁగఁ బడియున్నవాఁడూ చంద్రగు
ప్తుఁడట! తొల్లిటి దొడ్డజేఁడూ వానిదగు
జిహ్వాగ్రమున దేశచరిత యెంతున్నదో!
చెలికాఁడ! యొకసారి పలికించిపోవోయి! 10

రెడ్డిరాజుల తెగువ
గట్టిపోయిన దొడ్డ
సోపానపంక్తి గమనించీ కాలమున
జెఱిగిపోవని కీర్తి నెంచీ యాటవిక
రతి పరీమళ కలిత తతశిలా వేశ్మముల
జాగుసేయకముందు – సాగవోయీ! జలద!! 11

దట్టముగఁ దోరణలు
గట్టినట్లున్న – గీ
కారణ్యములను వర్షించీ పుష్పిణుల
వీరుధమ్ముల సవదరించీ కడసారి
వందనము జేసుకో భ్రమరాబింకకు! మెఱపు
సంధించి – దీపికార్చన జేసి యడుగులకు 12

అడవిదారుల జిక్కి
నుడివడెడి లంబాడి
యాకాశమున జూచునేమో! విద్యుదా
లోకంబు నాశించునేమో! మెఱియరా
శుష్కనాగరికతల సోకోర్వనట్టి – యా
సోయగము – నీకనులఁ బాయకేనిలచీని 13

నా గ వ ల్లి వా స
నాగర్భమగు గాలి
బాఱు తెంచెడు నెదురు నీకూ వాని చెలి
కారంబు నెడసేయబోకూ! మ హానంది
నంధకాసురహంత – ధిం ధిమ్మ టంచు నా
ప్రమథ నాయకుల సేవానృత్తముల వెలుఁగు 14

అడవిగొల్లల గుడిసె
లందందుఁ గనుపించుఁ
బోవుదారుల యందు నీకూ ఘుమ్ముఘు
మ్మనుచుఁ గవ్వపుఁ బాటసోకూ కంచుకం
బులకు నణఁగని గొల్లెతల ప్రతిక్షణ విజృం
భణబాహు కూలంకషణ కుచద్వయరుచులు 15

చల్లడములతో వెట్టి
గొల్లలైనారు రా!
చదువు సంధ్యలు సుంత లేవూ శ్రమపడిన
సౌఖ్యములు వారికే కావూ నాగరక
తాజాతి – వారిమేదో మాంసములపైని
'తాజా'గఁ గట్టినది దమసౌఖ్యసౌధాలు 16

తన రుమాలకు వింత
తాండవంబులు దిద్ది
పంకించి పంకించి శిరసూ శబ్దములు
జంకించి, చూపించి దురుసూ సుద్దులను
బలుకువారల జూచి తలచేవు! తక్కువని
జాతి విక్రమమునకుఁ గేతువులువారన్న – 17

పులితోలు గట్టికొని
చెలువు 'ఛత్రీ' బట్టి
రంగురంగుల గుడ్డలూ నీ చేఢక్క
జెంగలింపఁగఁ గ్రొత్త 'బాణీ' గన్పించు
బుడుబుడుక్కలవాఁడు నిడుద పాటలతోడ
కడలేని యవ్వానికష్టంబు నడుగరా!! 1

ఏనాఁడో విద్యలట!
యిట్టి వెల్లనుగూడ
జలదమా! దేశమ్మునందూ     వారి కడు
పులకు నన్నము బుట్టెముందూ     అకటకట!
ఇంటింటలోఁగూడ నింగ్లీషు చిలుకలై
నేఁడు మా చదువులే నేలపాలై పోయె! 19

చిగురు చెంపలపైని
చెమట జిత్తడిదుడువ
కలువ పూమొగ్గలను దాల్చి     హాఁసఖీ
తలములగు జూపులను వ్రాల్చి     పూలమ్మ
బయకారులీనాఁడు బట్టణమ్ముల లేరు
నాగరక జాతులకు, ననలన్న ద్వేషమ్ము- 20

తడబాటు నడలతో
నడుము కిటకిటలాడ
పేటలను నూడ్చుచుండేరూ     మా లెతలు
గూటికై వాపోవువారూ     నీరదమ!
ఒకగడియ నీ నీడ లాలికించివారిపై
యాకేకరిత దృష్టినందుకో! బసదనము 21

అటనుండి మరలరా!
యంబుదా! వెన్కకై
నెల్లూరి త్రోవఁబట్టేవూ!     యటనున్న
నెఱజాణలకును వలచేవూ     తిక్కన్న
కవిత మరగిన వేరు కవిత ససిచెడినట్లు
వారిఁ జూచిన, వేరు వనితలకు మదిబోదు- 22

కొత్తిమిరి కాడలై
గుత్తంపు చిఱునగవు
లత్తమిలగా మోవులందూ మొగములకుఁ
దన్నుఁగాఁ జన్నుల పసందూ రేలయం
దభిసారికలు దిరుగు నందంబు చందంబు
'విక్రమపురం' బందు వీఁగలే దీనాఁడు 23

'పెన్న దాటిన గదా!
పెరుమాళ్ళ సేవ' యను
సామెతకు నెలవైన ఱేడూ శ్రీరంగ
నాథుఁడచ్చోటనున్నాఁడూ వైష్ణవాం
గనల నవ్వులఁ బోలి, కమ్మ తావులువల్చు
'తోమాలియ'లుదాల్చి తొంగలించెడు స్వామి- 24

అది భిక్షువు మనసు
నాదికొన్నది - వగలు
పెన్నకును పెన్న యేసాటీ పెఱతరం
గిణుల సోయగము లేపాటీ జలధీశ్వ
రుఁడు తెన్నులనుజూచి యెడఁద గామంబాచి
'యదె వచ్చె నిదె వచ్చె'నని ప్రొద్దులనుబుచ్చు- 25

'గంగ'లో దానమ్ము
'తుంగ'లో పానమ్ము
పేరగనె భారతమునందూ యీ రెండు
గలవు గుణములు పెన్నయందూ తిక్కన్న
కవి కలం బంతగాఁ గముచుటలు పొలపంబు
పెన్నగట్టున బ్రదికి పలికిన యదృష్టాన - 2(

మనుమసిద్ధి నృపాలు
మామయగు 'తిక్కన్న'
యజ్ఞ వేదికఁ గట్టినాఁడూ పెన్న గ
ట్టున జన్నము హవించినాఁడూ ఆ సోమ
యాజి యజ్ఞఫలంబె-యాంధ్ర కవితలయందు
యీనాఁడుఁగూడ భాసించుబో రసమయము

ఖడ్గతిక్కన్న ఘల్లు
ఘలుమంచుఁ జిఱుగజ్జె
లెలుగించు ఖడ్గమ్మువట్టీ కోసనటు
శాత్రవుల తలలుచేపట్టీ వాని చా
వునగాథ - యచ్చరల పులకలే రేపినా
'పుల్లరి'కి జరగెనటపోరు! నగవులచేటు

మరులు దొరలిన నీకు
మఱలు - నెల్లూరికై
నాకెంత యూలస్యమైనా యోర్చికోం
దునులెమ్ము రసికుఁడనుగానా! అచట నే
నిలుచేవు! తెన్గునేల లింకనున్ గలవు
పండుగలు కన్నులకు-వంచితుఁడవయ్యేవు-

కొండ గోగుల కాంతి
గోరగించెడునట్టి
తాళి గోణమ్ములను గట్టీ కుచ్చుగల
మీసముల యెఱుపులాకట్టీ మాపులను
వ్రేలాడుకోలతో వేడ్కతో నిను జూతు
రచటి యెద్దుల రడ్డు, లవని పులుమోయునని

ఒళ్ళెల్ల తిమురు – మను
బిళ్ళపోలికఁ జెంగు
చెంగుమని దాటించికొనుచూ గంతులను
ఖంగుమని మ్రోయించికొనుచూ చెవినిక్క–
బలువన్నెలైన దూడలు–ముట్టెలెత్తికొని
నీ చినుకులకుఁ జెలఁగి – నీ తెర్వుఁబట్టీని – 31

'మా కుచము లింత'లని
నీకు సూచించునటుఁ
జేతులను చెంబులు ధరించీ గొల్లెతలు
పాలుపిదుకంగ నూహించీ కనుపింత్రు
వెట్టులని పొరపడకు–వెలఁదులకు జాణతన
మచ్చి వచ్చినవిద్య–యెచ్చోటఁ బుట్టినా– 32

నీదు నిష్యందముల
నిలువెల్ల నుచ్ఛ్వసిత
మైనయవనీ గంధమానీ ధ్వనిత సుభ
గంబుగాఁ గాయమ్ము నూనీ మృదువైన
యెలగాలి దేర్పఁగా జలదమా! జేరుకొ
మ్ముదయగిరి కాననో దుంబరంబులుబూఁయ– 3

వామ నీ కృత కుచ
వ్యాసక్త పులకముగ
సకులఁ బరిరంభణముసేసీ కనులార్చి
యున్న చెంచుల వీక్షసేసీ పుష్పమే
షీకృతాత్ముఁడవౌచుఁ గురువవలె దివిజ గం
గానదీ శైత్య సంకలితమ్ముఁగా నొడలు– 34

రతి విగళీతమైన
సతుల క్రొవ్వేదలవలెఁ
గుప్పలగు నెమలి కన్నులతోఁ చెలువాఱు
సెలయేటి తనిజలంబులతో నాటవిక
సీమంతినీ జఘున సీమానుకారి కుం
భేభములు 'నుదయగిరి' బ్రీతిగొల్పును నీకు

జ్యోతిర్లతాప్రతా
నాతపావిష్ట మా
నా కొండపై మేను వ్రాల్చి తత్కాంతి
చే-వింతవగలు మెయిఁ దాల్చి కదలిపొ
మ్మటనుండి విజయనగరాంధ్ర జనపుల త్యాగ
శీలమ్ము వచియించు చెఱువులను గనుగొంచు

౬

"అద్దంకి" యొక్క-నాఁ
డమర కాంతల వీడు
రెడ్డి రాజుల వైభవమ్మా పుష్పించె
నాంధ్ర కవితల కాస్పదమ్మా యానాటి
రెడ్లన్న నీనాటి రెడ్లుగాఁ దలఁచేవు
వారి పేరులు దెన్గువారి కాభరణాలు-

కోటప్ప కొండలో
నీటు కత్తెలఁజూచి
అక్క-డే నిలిచి పొయ్యేవు! ప్రియకు నా
దిక్కుఁ జెప్పంగ మఱచేవు! తెన్గు నే
లలయందు వక్రకుంతలల సౌభాగ్యంబు
లక్క-డిక్క-డ నేమి! యన్ని చోటులఁ గలవు

ముగురు మూర్తుల కెక్కి
తెగువతో 'భారతము'
కలముతో దాటించి నాఁడూ 'శంభుదా
సుఁడు' హృదయమున గడలిడేఁడూ స్ఫురదరుణ
రాగరుచిగల్గు శారదకాలమూ కవి యు
దార రచనలు-రెడ్ల త్యాగ సంసూచికలు- 3

సరసాగ్ర గణ్యుఁడవు
మఱచేవు 'తెన్నాలి'
చూడవలె నాస్త్రీల మెలఁపూ వారి యొ
య్యారి మాటలఁ బొలుపు తలఁపూ తెన్గు రసి
కతకు నాయూరికే గండపెండారమ్ము-
అది యాంధ్రభూమి కుచాగ్రహారాభమ్ము- 4

'గుంటూరి' వాఁడటర!
దంట 'భాస్కరమంత్రి'
సారకవితాభిరాముండూ తిక్కనలు
మ్రొక్కికొన్న పితామహుండూ నీ చల్వ
చూపించి పొమ్మచట, సెగయించు నెండలకుఁ
దాల్మిఁదక్కకమున్న దరుణీ వితానమ్ము- 5

మొలనూలివలె విహగ
కులము నదియింపగా
సుడివంటి నాభి జూపించీ స్ఖలిత సుభ
గంబుగా నడక దోపించీ కట్టెదుట
గనుపించురా! 'గుండ్లకమ్మ' స్త్రీజాతికిని
ప్రియులందు విభ్రమమె-ప్రణయవచనము సుమ్ము 6

కడునవసి జలము నీ
యెడఁబాటుతో-తీర
తరులందు నాకురాలంగా      త్వద్విరహ
పాండిమము మేనదోఁపంగా-      ఉన్నయది
నినుదప్పఁ బ్రేమింపనేరదుర వేరొకరి!
ఘనుఁడ! దొలగింపవలెఁ గార్శ్యమ్ము నెమ్మదికి 7

కృష్ణరాయలదృప్త
కంఖాణ ఖురటంక
చిత్రితములగు చోటులందూ      నడుపరా!
కొండవీడును ముందుగందూ      రెడ్డి రా
జుల కీర్తి పఠియించు శిలలందు, నీ జలము
చిలికించి మలినంబు దొలువరా! నీవైన! 8

మదగజంబులతోడ
మచ్చరించెడు నట్టి
ఊరుకుచయానములు గలిగీ      రెడ్డి యొ
య్యారులిచ్చటఁ బరువుచెలగీ      తిరిగిరట!
నేడిచటఁ దిలకింపు నీరదా! కడిలేక
చెడిన మొగములతోడ సేద్యగాండ్రున్నారు 9

ఒకనాఁడు 'శ్రీనాథు'
డోరంత యమృతమ్ము
చిలికించె నీ కోనలందూ      చెడిపోయె
రెడ్డిరాజ్యము కాలమందూ      ప్రియసఖుఁడ!
ఆనాటినుండి నీయమృతమే శరణంబు
గాన-కానసుమింపఁ గానిమ్ము వర్షమ్ము 10

చిటపట మటంచు నీ
చినుకు చినుకుల రవళి
[1]వామనుని గద్యకవితలకూ సాటిరా
వర్షింపు – నీకేల తలకూ? జనవాదు
పలుకు నేమో! నీ రవళి వాని రచనమ్ము
పోలదని – గానిమ్ము భిన్నరుచి లోకమ్ము 11

ఆ నా టి వే మ న్న
యాటఁ వెలఁదులవంటి
గిరిమల్లికలను బూ యిం చీ గొండకోక
మురిపెమ్ము – క్రొత్తరప్పించీ రెడ్డిసా
నులతమ్ములము తావులలము చోటులనిచ్చి
తిలకించి కావిమోవులముందుఁ గదలవలె 12

కాళిదాసుని నిం డు
గవితఁ దూచె దొకండు
ఒక్కండు రసికభూపుండూ అమరుకుని
దిక్కుజూప మఱించినాఁడూ క్రొత్తబిగి
వారు సామాన్యులా! సారసారస్వత
ప్రాశనులు–ఆంధ్రకుల భాగ్యమ్ము రెడ్లన్న– 13

1. వామనభట్ట బాణుఁడు రెడ్డి యాస్థానమునందలి సంస్కృత గద్య కవి. బాణుని దరువాత మరల నంతటివాఁడు.

మదవతీరతి సమయ
మణితమ్ములుగ – మేఖ
లా ఘులాంఘులలు దోపించీ     యాడినది
'లకుమ' శాస్త్రమ్ము బండించీ     కొమరగిరి
భరత శాస్త్రమ్మునకు భంగిమలు సవరించి
'పంచెవన్నెలకాసె' బటువుగా బిగియించి– 14

హైయ్యంగ వీనంబు
లారగించిన రెడ్లు
కేలముంగిళ్లలోఁ జేరీ     పూర్వ కా
లాల రాజుల కథలు చీరీ     మీసములు
గోరగింపఁగ జెప్పికొను చుందురో యేమొ!
వారి యుల్లాసంబు వారింపకుర, సఖుఁడ! 16

బాలనాయని కత్తి
పరవళ్లు ద్రొక్కినది
పల నాడు దా జలదరింపా     అదిపెద్ద
భారతంబగును వర్ణింపా     నలగాము
నపకీర్తి కజ్జలములంటిన శిలాతలుల
నంటి నిలచేవు–నీయలఁత యోరంతైన 17

చాపకూటికిఁ గాఁగఁ
ద్రోపులాడిరి రాజు
లయ్యయో! యారాజ్యమందూ     ఆంధ్ర చా
రిత్రలో నీ కథలు మెండూ     పెడత్రోవఁ
బట్టు నాయకురాలి ప్రజ్ఞాబలమ్ముతో
పలనాడె–తా, వట్టి పాండవుల బీడయ్యె 18

చెన్న కేశవరాయఁ
డున్నవాఁడచ్చోట:
శాద్వలితములు నేలలందూ - వర్షింపు
స్మయమాన గోగణములందూ నీచల్వ
చెలువారు-జొన్న చేనులఁ బాలకంకులై
చిలుక కలకలలతో - పలనాడు నవ్వీని 18

విర్రవీగెడు చనుల
వేడ్కనించెడు కనుల
తెలుఁగుబాలఁతులు పొలములందూ మంచియల
నిలిచి - చిల్కలఁ దోలఁగందూ మన్మథుని
ధనువులై నిల్చు నా కన్నియల వీక్షించి
వన్నెకాఁడా! నీదు వర్తనమె మఱచేవు 19

నాగార్జునుని పాద
నళినంబులకు మ్రొక్కి
స్తూపముల దరిసించికొంచూ ఆ శిల్ప
శోభలను భావించుకొంచూ భూదేవి
పులకలను దలపించు తొలిపైరు పండించి
అలస సుందరముగా నరుగరా! యోరఁగా 20

౬

నీలి చీరనుదాల్చి
నీకెదురు వచ్చేని
మదకలంబుగ నిస్వనింపా బెగ్గురులు
మృదువలయ రవము విన్పింపా బేడిసల
తళుకుఁ జూపులతోడఁ దెలుఁగు యొయ్యారంబు
దులకింప 'గృష్ణమ్మ' జళికించి నీయుదుటు 1

దాని సౌభాగ్యంబు
దనివోవఁగా జూచి
రసికతా రసము వర్షించీ శైలక
్రమ నితంబ మంటి శోభించీ కంటకము
లట్టి మల్లెలుబూచి యామోదములు దూయ
నెట్టి కొనిపోవవలె నెఱఁకాఁడ! దయచేసి 2

కృష్ణవేణీ తరం
గిత శీతజల లవా
సారపూరిత మూర్తియయ్యా యొకచాటు
కారుండుగా మరుతుఁడయ్యా తనువల్లి
కనుకూలముగ వీచి పెనకువల యలఁతఁబో
దట్టఁగా- సుందరులు దల్పములు విడువేళ 3

పోవలయు విజయ వా
టీ వ నం బు ల కీవు
అలకలెల్లడ నాక్రమింపా నుదుటిపై
తిలకంబు చెదరి ససిసింపా పెన్నెఱులు
పిఱుదంట - గ్రొత్తలకుఁ దరియైన తెన్ను బి
త్తరి జూడకున్న నేత్రములు వ్యర్థములౌను 4

కమ్మగా కుంకుమము
లమ్మకుండిన సతులు
పుష్పలావికలు గలవైనా గందాళి
పుప్పొడుల మంచుగలవైనా లకుమాయి
క్రమనూపుర కుహూకారంబు లేకున్న
నేటికిని విజయ వాటికిఁ బెంపుగలదోయి 5

పచ్చి యత్తరుతావి
పారెనిట నొకనాఁడు
కృష్ణమ్మ నీటిలోఁగలిసీ మదవతీ
కాంతకుచ కుంకుమములొరసీ జలకేళి
సవరించిరిట దెన్గుచాన లానాళ్లలోఁ
జరణ నూపుర ఝుళంఝుళ నినాదములతో 6

ప్రతియింట వీణియలు
బారించె గానమ్ము
ఘర్మకంకణ నాదమొలసీ తానమ్ము
బరగింప జీవనపు సరసీ ఆంధ్రయో
షామణుల్బాడిరట! యానందముగ నాడు
స్వర్గమున కన్ననిట సౌఖ్యమ్ము గలదంచు 7

లలిత వనితాపాద
తలలాక్షతో-విభూ
షితములౌ నీ వీధులందూ నడచెనట
గృష్ణరాయలు-ముందుముందూ రసకావ్య
భామినీసుఖ పరిష్వంగ సౌఖ్యాకాంక్షి
శ్రీకాకుళస్వామి జేయెత్తి పిలువంగ 8

తననాథు కంఠరుచి
దాల్చు నిను వీక్షించి
కనక దుర్గాదేవి నవ్వా నిలుమోయి!
గర్జార్ఘ్యంబు లందివ్వా సంధ్యలను
సరస లాస్యములాడు జండికేశ్వరి - యపుడు
మెఱయించు నీ యుఱుముయుఱుము వాద్యమ్ముగా 9

నదిని తానములాడు
మదవతుల చనులపై
పడిమిట్టి పడిన తొలిచినుకూ — నఖపదము
లంటి గలిగింప గ్రొత్తళుకూ — వారి మ
త్తాళి సందోహ దృఙ్మా లార్చితుండవై
తన్మేఖలాగాన మానియటు బదవోయి 10

'ధిమ్మిధిమ్మ'ని వెంట
గుమ్మఁడే గులుకంగ
తీర్థుఁ డౌ నారాయణుండూ — తారంగ
భంగిమలఁ బాడెనటముందూ — ఆ కూచి
పూడి విప్రుల 'సత్యభామా కలాపమ్ము'
తేట తేనియకందు – తెనుగునేలకు విందు 11

ఆయూరి బ్రాహ్మణుల
కేయు పాధులె యున్న
జన్మలో నొకసారిగానీ — గజ్జెలను
గట్టనేవలె నంటబూనీ — నాట్యమున
కై యెంత త్యాగమ్ము! అనవరతమును నందు
ధ్వనియించు ధీరమర్దలలు, మృదుమణితములు 12

సిగర్జ నదలించి
నిభృత గళములనెత్తి
మద్దెలలు జతులు వేయంగా — మెయిమఱచి
మెఱపు వర్తింప వేగముగా — దుసికిళ్లు
లాడు నలకలతోడ నందగించెడు మోము
గందులెమ్మొకసారి–కనుల పున్నెముగూరి– 13

శాపమున నప్సరస
లీపుడమికిని వచ్చి
నారలా పల్లైలో స్త్రీలూ వారిభ్రూ
భంగములు మదను చాపములూ తనివి దీ
అగఁ జూఁడు మవ్వారి రసికతలు: స్త్రీ లేక
నీసృష్టిలో నింక నేది సంతోషమ్ము! 14

మువ్వంకలై నిలిచి
'మువ్వ' గోపాలుఁడట!
యున్నాఁడు రాసిక్యభరమూ! క్షేత్రయ్య
కవితా లతాంగి జీవవమూ మగపుట్టు
వదిమఱచి-నాయకీ భావమూనిన సుకవి
యెన్నిమాఱులు దన్ను నేరీతి వలచెనో! 15

క్షేత్రయ్య లేనిదే
తెన్గునకు రుచియేది!
తేనియలు పారించినాఁడూ కృష్ణుచే
నట్టువలు ద్రొక్కించినాఁడూ నాయకీ
భావమూనిన సుకవి పదము మరగినస్వామి
నారదాదుల పాటపై రక్తి గొలుపఁడే! 16

[1] ఒక్క నట్టువకత్తె
యొక సుకవి జీవనము
మార్చివేసినది కాలానా కవితలో
దాను నిల్చినది దర్పానా కుసుమ సుకు
మారహృదయలెయైన, మానినీ నికరంబు
వారు జేయఁగలేని కార్యమే భువిలేదు – 17

1. చిన్నతనమున క్షేత్రయ్య యొక నాట్యకత్తెను వలచెను. అది 'మువ్వ గోపాలుడు నీ పాటకు మెచ్చితల నూచినచో' నిన్ను వలతున్నది. క్షేత్రయ్య యదే పనిగ నీరు, కూడును విడచి పాడుచుండగా కృష్ణభగవానుఁడతని పాటకుఁ దల నూచెను. కృష్ణుఁడు తలనూచు వేళకు_ క్షేత్రయ్యకు నాట్యకత్తె గాఁబట్టలేదు.

" చంద్రగిరి " కడఁబుట్టె
"క్షేత్రయ్య" యనియొక్క
వాదులే! వాదముల కేమీ సత్కవికి
నిదిదేశమని యున్న దేమీ! అతని మలు
పచ్చికవితలు వింధ్య పర్వతమ్ములు మొదలు
కన్యాకుమారివరకై - దేనియలు గురిసె -

౨

చుట్టనుచు జడిసేవు
చేరంగ మఱచేవు
కాకతీయుల యోరుగల్లూ ఆంధ్ర చా
రిత్ర కన్యక పుట్టినిల్లూ రుద్రమ్మ
చండీశ్వరీదేవి జలజలా బారించె
శాత్రవుల రక్తమ్ము చెడని సెలయేఱుగా-

యాదవాన్వయుడగు-మ
హాదేవ రాజు - తా
మగువయని-చులకనగఁజూచీ మనసులో
మగతనము పేరాసలాచీ కత్తిగొని
వచ్చిపడెనట నాఁడు! చిచ్చుమిసి రుద్రమ్మ
వెడలినది-విక్రమము వెడలినటు రూపెత్తి-

కదనరంగమునందు
కాళికారూపమై
యేయెడలఁ దానుగన్పించీ యాదవుని
ఆయువిక - నిల్వదనిపించీ తరిమినది
'దేవగిరి'[1] వరకు నిద్రితగు హాస ముదయము
కడిమిగల తనదు హుంకారముల మేల్కొలిపి-

1. ఇది యాదవరాజు రాజధాని

దళితుఁడగు పగతుండు
దనశిరమ్మును వంచి
పాదమ్ములందు గీలించీ తెన్గు పా
రాణి సొమ్ముగను ధరియించీ వినయమున
కోటి ధనరాసులను గుప్పగాఁ బోసెనట!
కాలమ్ములోవింత కనకాభిషేకమ్ము! 4

'బ్రదుకుపోరా! తెన్గు
పడఁతి యడిదపువాఁడి
వ్రాయించుకో కావ్యమందూ! నీతితో
పాడుకో! జీవితంబందూ!' అన్నదట!
యొకనాటి తెనుఁగులో నువిద దృష్టికెగాదు
గరసాన బట్టినది – ఖడ్గ లతికకుఁ గూడ – 5

ఎచటెచట నిల్పి పో
యెనో! జయస్తంభములు
రుద్రాణి తెన్గు రుద్రమ్మా విక్రమం
బాపాదనఖము నస్రిగుమ్మా కాలాన
మాసిపోయిన యాంధ్రమండలీ విభవంబు
లే 'సోమశేఖరుఁడో'[1] యేనాఁడో చెప్పవలె– 6

అచట 'విద్యానాథు'
డమర కవిగనిపించు
చీకిపోయిన గుండియలతో నేత్రముల
నా కట్టు బాష్పసంతతితో నడురేల
నామహాత్మ్ముని మించుటడుగుఁదమ్ములఁ బాద్య
మర్పించి కదలరా! యతఁడు శంభునిమూర్తి– 7

1. ఈశ్వరుఁడు__మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

తనకావ్య నాయకుఁడు
దైన్యమున కెరగాఁగ
తానెంతగా నేడ్చినాఁడో! ఆ దుఃఖ
భరముచే మెయి వీడినాఁడో! అయ్యయో!
యేచోట నా సుకవి యిల్లు నెడి దుండెనో!
ఆచోట వర్షింపు మమరజన్మము నీది 8

తమరాజు విడిపించు
తమకమ్ముతోఁ దలలు
రణరంగమున కిచ్చినారూ రక్తమ్ము
కుండపోతలు చల్లినారూ! కమ్మవీ
రులు - పద్మనాయకులు - కలిగిన ఫలంబేమి ?
'సులతానుపుర'[1]య్యె తెలుఁగులది నగరమ్ము- 9

ఒక యుగంధరుఁడుండి
యుర్వీశు విడిపించె
నని యేవో కథలు కాలానా నీచెవులఁ
బడు నులే నీదుమార్గానా! రసమూర
నిజము దేవుఁడెఱుంగు నెచ్చెలీ! యాంధ్ర కుల
వైభవము - నీటిపై వ్రాత - కలలో పసిడి 10

శైవమున దాఁజిక్కి
జైనమత గురువులను
సెగకంటఁజూచె నటరాజూ వాని నా
శనము శాపము యొక్క తేజూ మతమమృత
మైనదే దురభిమానావిష్టమును గాక
యదియె హాలాహలం బావేశ కలుషితము- 11

1. ఓరుగల్లును 'తుగ్లకు' జయించిన తర్వాత దానికి 'సుల్తాను పుర'మని పేరు పెట్టెను.

జైనరచనలఁ గాల్చి
సంతోష పడిరట!
శాక్తులును శైవులునునాఁడూ   విజ్ఞాన
నాశమై పోయినది చూడూ   వారి కడు
పులను రేగినచిచ్చు కలఁచినది రాజ్యమ్ము
కలఁగినది విభవమ్ము-తలఁగినది జీవకళ-   12

ఆనాఁడు 'శ్రీశైల'
మందు 'కోసఁగి' యందు
'కోటిఫలి' 'పుష్పగిరు' లందూ   శివమూర్తు
లుండ్రు గురువులు మఠములందూ   నేఁడచట
పాడుగోడలు - తీరుబాటుగా లయగీతి
పాడు చుండెడునట్టి బ్రహ్మరాక్షసి గణము-   13

ఆయఘోరశివార్యుఁ[1]
డధిపసించిన చోటు
'పుష్పగిరి' పాండవులబీడూ   శ్రీచక్ర
మునకుఁ బూజలు లేనిగోడూ   కృష్ణరా
యల మాన్యములు రెడ్లపాలములై రతనాలు
పండించు చున్నయవి-పరమ శివునకుఁగాదు-   14

నెమ్మితోడుత 'ముసా
నమ్మనగ'[2] నొకచోట
నుండెనట నేకశిలయందూ   అదియెవరొ!
యేమయ్యెనో! కాలమందూ   యేమగును
పదివేల గుడులున్న పట్టణమె పాడైన
దటబో! 'ముసానమ్మ' తట్టుకొనునా యేమి!   15

1. పుష్పగిరి పీఠాధిపతులలో మహాప్రసిద్ధుడు. 13 వ శతాబ్దివాఁడు.
2. ఆదెముద్దరాల్మ సానమ్మ నివాసంబు నల్లదె కొమరు సామయ్య నగరు (క్రీడాభిరామము)

ఆకాలమున నొక్క
'యేకవీరా' దేవి
'బవినీలు' చెలరేగిపాడా ఆడెనట
మర్త్య రూపమ్ముదుల్కాడా నేఁడామె
చెలువమేదిన-యొక్క-శిల, కాలహుంకార
గళితకళ, చరితలో మలఁగిపోయినజ్యోతి 16

కనుపించురా! వీర
గల్లు లచ్చట నీకు
వర్షింపు మొక్కతడి, నిలచీ భూత నా
యకుని బలఁగములంచుదలఁచీ తెన్గులకు
వీరపూజలసేఁత వెన్నతోఁ బెట్టినది
వీరులెవ్వరు నేఁడు వీరపూజలు సేయ! 17

పోయె 'మాచలదేవి'[1]
పుష్పబాణాసనా
మ్నాయ విద్యాచార్యయయ్యా దిద్దెనట
రారాజు తోడవుగానయ్యా కల్లగా
దలనాఁడు-అలదాని యర్థము గౌరవము
ఢిల్లి సురతాణికిని కల్లగా నుండెనట- 18

'సప్త పాతాళవి
ష్టపమహాప్రస్థాన
ఘంటాపథం బైనపరిఖా' గగనద్రు
స్తబకమ్ముఁ బ్రాకారరేఖా వంకదా
రయును ఱెక్కలను దుల్కాడు కొండలఁబోలు
పెద్దగవనులతోడ - పాడయ్యె నేకశిల 19

1. కాకతి ప్రతాపరుద్రుని ప్రియురాలు.

తుగ్లకుని చెఱఁజిక్కి
విక్రమము ససిదక్కి
మా రాజు విడిచె ప్రాణమ్మ్మ తెన్గులకు
నారిపోయినది దీ ప మ్మ్మ వేయియేం
డ్లైన – యీచరితంబులీనాఁడు దలఁచినా
యీనాఁడు జరిగినట్లింతో వ్యధాభరము 20

తలవడకు వేయికం
బాలగుడి దరిసించి
తీయనగు శాసనము జదివీ యా'యచిం
తేంద్రు'[1] కవితల తలఁపులూదవీ పోవోయి!
కాలమున నెత్తములుగావచ్చు విభవాలు
కాలమున నెత్తమ్ముగాదు కవి వచనమ్ము- 21

సరసుఁడైనట్టి మం
చనశర్మ[2] బారాడి
నట్టి వీథులు చూచి చూచీ యీనాఁడు
వట్టిదగు సోయగముఁజూచీ నిట్టూర్పు
వదలకుండఁగ లేవు వనదమా! నీ మెఱపు
మదికలఁగి యేమంచు మరిమరీ ప్రశ్నింప- 22

కులుచు చన్నులతోడ
బెళుఁకు గన్నులతోడ
లాస్యమ్ము లాడిరటనాఁడూ జవ్వనులు
వేశ్య లల్లాడఁగా మరుఁడూ నేఁడచటఁ
జూడవోయీ! యెట్లుపాడునో భూతమ్ము!
పాడైనకోటలోఁ బదము నేలకుఁగొట్టి - 23

1. 'వేయికంబాలగుడి' శాసనకర్త
2. 'క్రీడాభిరామ' నాయకుఁడు

నీ మెఱపు దలపించు
నిండు నవ్వులపూవు
బోణులిటఁ బూబాళలమ్మా  పల్లవుల
యెడఁదలను జూపులను గ్రుమ్మా  యేలిరట!
'అంటంట'లయ్యో! మా యాంధ్రుల పురావిభవ
మదియొక్కకల! యొక్కయమ్మ తాంధనులబ్రదుకు 24

[1] "కాపయ్య" కంఠహుం
కారంబులీ నాఁడు
కోటలో వినిపించునేమో!  విక్రమము
గ్రుమ్మకొని పారాడునేమో!  భయపడకు
మతఁడు విప్లవమూర్తి - యంభోధి గంభీరు!
డసదు ప్రాణుల పైకి హస్తమ్ము దాచండు 25

రెడ్డి రాజులు - పద్మ
నాయకులు హృదయముల
జిడ్డుదేఱఁగ మచ్చరములూ  తన్నుకొని
క్షీణించినారు దుర్గములూ  భారతము
పాడైన దే పరస్పర శాత్రవములతో;
వనదమా! యేమనఁగవచ్చు మూర్ఖత్వమ్ము! 26

ఆస్వాయం భూలింగ
మవినాశి ద్వంద్వభా
వాతీత మచట గన్పించూ  నీగర్జ
నొయ్యారముగను విన్పించూ  చల్లాలను
పాటపాటని తుమ్మి పూవులవంటి చిన్కులను
నటమూర్తి నర్పించి - యటుసాఁగు ముందునకు 27

1. ఢిల్లీ చక్రవర్తులపైఁ దిరుగబడినవాఁడు.

''భువనగిరి'' కోటయది
మొగమెత్తు సింగంబు
త్రోవలో నడ్డిగొనునిన్నా పద్మనా
యకుల చిచ్చఱకంటిమన్నా రవ్వంత
విశ్రమింపరయందు – వివిధ గాథలు ద్రవ్వి
వినిపించు నాకోట వీర విక్రమ భేరి 28

తననామ జపముచేఁ
దడితావు లీనుమది
రామ చరణాబ్జజముల వ్రాల్చి ప్రారబ్ధ
భోగంబులోఁ దనువు వ్రేల్చి గోపన్న
జన్మమోక్షముగన్న చెఱసాల గనిపించు
జలదమా! యేత్తువో! సంతోషపడెదవో! 29

అది ''గోలకొండ'' వ
ప్రాకార మపకీర్తి
''తానీష'' యందుండెనోయీ! యారాజు
మానసంబొక చుట్టురా యీ వాఁడేమి
సేయు! శ్రీరాముఁడే చేయించె సకలమ్ము
భూమిపై నొకదృష్టిబొమ్మ, వానిని నిల్పి 30

ప్రతిరక్తకణము – శ్రీ
రామునకు వెచ్చించి
కన్నీరు గాలువై పారీ చెఱసాల
తనువు త్యజియించె వేసారీ యా రామ
దాసు బొందిన దేమి! ధన్యుఁడని యొకవాదు
యీ సృష్టి రాహస్య మెవ్వరికిఁ దెలియదే 31

1 ''అళియరాము''ని జంపి
నట్టి రాసుతుఁడుండె
నీ గోలకొండలో జలదా! మోసమున
జంపంగ శౌర్యమ్ము గలదా! గడిచిపో
యిన దింక నేమన్న నే ఫలం బచ్చోట
తనుపారు నీ జలము తనివోవ వర్షింపు - 32

నీ దైన తెలిమంచు
నిండికొని యాకోట
మేల్ముసుఁగు ధరియించినట్టి యొక బీబి
పోలికల యొఱపులాకట్టి కనుపించు
నచ్చోట నిలువవలె నంబుదమ! రసమూర్తి
వగు నీకుఁ గదలునా! యడుగులక్కడనుండి- 33

'మంజీర' నినుజూచి
మంజుమంజీర శిం
జానములఁ దలపించునట్టి జలపక్షి
జాలరవముల సొంపుగట్టి నవ్వోని
శారశారములైన శంబరమ్ముల కాంతి
నీరూపుఁ దలపింప-నీయెడఁద గలగింప- 34

గలగలని చిఱునాదు
మొలనూలి మంజీర
తెలిసీటి నగవు మంజీరా మదదిగ్ధ
లలిత యానంపు మంజీరా వగలాడి
యద్దాని మినుకు చక్రాకార కుచతలము
లందుఁ గను మోడ్చి కొ, మ్మఱగడియ నేపైన 35

1. ఇతడు కృష్ణదేవరాయల యల్లుడు. ఇతనిని 'తల్లికోట' యుద్ధమున మోసముతో నాదిల్షా జంపెను.

మనసు మాయలు లేని
మెత్తనిది మంజీర
ప్రేమైకరసము మంజీరా   తనయింటి
పేర్మిదప్పనిది మంజీరా   నీ మెఱపు
బొమ్మలు చిట్లించినా—బొంకాడినైన—నా
కమనీయమూర్తి నీ కౌగిటను జేర్పవలె— 36

గడియ గడియకు వింత
కాంతిగల మంజీర
నుడిదప్పనట్టి మంజీరా   నీకొఱకె
యెడఁద గట్టినది మంజీరా   పులినమ్ము
లనునితంబములంటి లలిత పేశలముగా
మొనగాఁడవై, తావి మోవి, నాన గదోయి— 37

బౌద్ధ భిక్షుల ప్రతిభ
పాలించినట్టి గుహ
లందున్న దొక్క—స్వర్గంబూ   చూడక యె
పోయ్యేవు జన్మవ్యర్థంబూ   రంభాది
దేవకాంతల బెడఁగు తీసికట్టుగ నిలిచి
కొన్న వా కన్నియలు—క్రొల్చుకాలముఁదన్ని— 38

౮

'వేగి' జూడకయున్న
వెకలి వందురు నిన్ను
చాళుక్య పూర్వనగరమ్మూ   యొకనాఁడు
సంపదల కాలవాలమ్మూ   నేఁడచట
నేగుఱుతు లేకున్న నేమాయె! నా మంటి
గాలిసోకిన, యెడఁదఁ గదలాడు నొకపొగరు—

చిక్రోడ దంష్ట్రికా
శిఖర చిహ్నితమైన
నాళికేళ వనమ్ములందూ శ్రమదీర్చి
కొమ్మరా! యా సుఖముగందూ నావనులఁ
బాడుచుంద్రు మద భారగర్విత కుచలు
కచములను లాంగలీకవిచ సుమములఁదుఱిమి- 2

మొగలి పూవులతావు
ముసరికొను మార్గాల
మెలమెల్లఁగా నడచినడచీ నేరేడు
చెట్లనల్లని వనులు గడచీ పోరాక
పోవోయి! నేస్తమా! పూబాళలమ్మికొను
ముద్దు గుమ్మలసిగ్గు మూలములు గిలకొట్టి- 3

కనుచూపు మేరలై
గనుపట్టు గొజ్జగులు
కావి చీరలతోడి నీకూ నీమంచు
జిలికింపకుండ పోవాకూ తెలిరాల
దొనలలో నాసిరు తోయజాక్షులు సేయు
స్నాన సౌఖ్యమహమ్ము సవరించునో! యేమొ!- 4

గగనమను జవరాలు
గట్టికొను పచ్చనగు
పుట్టంబునకు తోడులయ్యీ కీరములు
పారాడఁగాఁ బదుపులయ్యీ బూదేవి
చనులవలె గనుపించు సరసాగ్రమ వనులతో
వదమా! విశ్రమింపర! పథశ్రమ వాయ- 5

చిగురు బోడుల మోవి
చిగురులకు ననుగలము
లైన కిసముల గుంపులందూ విశ్రాంతి
నీవుగైకొను కాలమందూ తత్పల్ల
వప్రతిచ్ఛాయతోఁ బలువన్నెలైన నీ
మెయిఁజూచి, నీ మెఱపు మెచ్చి కనులార్చిసి- 6

చలువలగు నిమ్మతో
పులపైని గాలూని
యింపుగొను నా చెట్లనీడా మదమాని
మగలతో మగసేఁతగూఁడా మానినుల
చిఱుచెమటలార్చి-బిత్తరఱము దొంతరలైన
సరసదృష్టుల కదృష్టము బండ పయనింపు 7

కన్నియల చనుగట్టు
కరణి ముద్దులుగట్టు
పోకలను జిగివలచునట్టీ మ్రాకులను
పోవోయి! నీ తెరువుబట్టీ వానితో
నుందురట! పల్లియల సుందరులు వీక్షింతు
రనుకొందు నుద్గృహీతాల కాంతముగాఁగ 8

నవకముగ నిలుచున్న
నాగకన్నెలఁ బోలు
నాగవల్లీ వనములందూ చల్లనగు
చిఱుగాలి పొరల తెరువందూ తమ్ములము
తావి మోవికి వింత తళుకుగాఁ గాపున్న
కమ్మ కన్నెలఁ జూచి-కనుసైగ జేసేవు ! 9

నీమెఱపు చెక్కిళుల
నెనయుదెలనాకులను
పోకచెక్కలు తోడ నమలీ సున్నంబు
పెదవంటి, యెకసీటుపొదలీ ఘనసార
మదము గ్రమ్మినయట్టి మదవతులు గీడింత్రు
కేలనచ్చటఁ గిన్నరీ బృందమనుకొందు 10

చెఱకు తోటలను-మం
చెలపైని నిలుచుండి
హోయంచు నెలుగించువారీ తెర్వరుల
నదలించి చిఱునవ్వు వాలీ మిన్నుక
త్తెలఁజూచి వారియంచులు మోవవర్షించి
చంద్రవంకల చుఱుకు జార్చిపోరా! సఖుఁడ! 11

'హేలాపురి' ప్రాంత
హేలావతీ మధుర
దరహాసములకుఁ జిక్కేవూ విరహ భా
రమ్ముతో సగము చిక్కేవూ మదనాంత
కుండైన, నా యూరి కుహనాకుపితలైన
కోమలాత్ముల యొక్క కొస చూపువరవుండు- 12

కలమ గోపికల - నీ
టులుగుల్కు కర్ణముల
నున్నట్టి కలమ మంజరులూ నీ గాలి
సోకివాసింప మధురములూ లోలేంద్ర
గోపరత్నాంకూరకుట్మలిత మార్గముల
బయనింపరా! మునుము బ్రమదమ్ము పొంగార 13

శాలి లక్ష్ములకు - వ
జ్రాల దండలఁబోలు
చిఱుకాల్వలందు వికసించీ    పద్మమ్ము
లున్నాళముగఁ గానుపించీ    నీ తెర్వు
తోరణాలు గట్టంగ - తోడు నీడై రాఁగ
మారుతము సరసమ్ము-సారసము రుతితోడ- 14

కదలవలె నోసఖుఁడ!
మొదలు వాలుగల త
ళ్కులజూచి యుత్సాహమూచీ    నీరుకో
ళ్కొళ్కొళని గూయ మదమేచీ    లకుముకులు
బుగులు భుగులున నెగయ, పొగరు హరిణములు నీ
మొగము నెక్కొనిచూచి - ముందుగాఁజొఱబాఱ- 15

అడవి దున్నలు పందు
లానందమును బొంది
క్రేళ్లురుకు నధ్వమ్ములందూ    మనుబిళ్లు
బురద దిగఁబడు దారులందూ    పోవోయి!
కృకలాసములును మాటికివి మస్తము లెత్తి
యాకసము వీక్షింప, నడవులేపులకింప - 16

నెఱేఁబునాసలు బిసుకు
నెఱకాండ్రు హాలికులు
గుడిసెలందున గాచికాచీ    యంబళ్లు
వడిదెచ్చుపొల్తుకల నాచీ    జాంగలా
విషమైన యన్నంబు మెసవుచే దడవుగా
మిషపెట్టి-కుచభరము బిసుకు త్రోవలయందు- 17

ఎలగోలు జల్లుఁగా
బాలయు జవ్వనమొకటై
తోడుగాఁ జింత చెట్లెక్కీ దూరాన
చిగురు గోసెడు వానిచక్కీ దాగుండి
తాజూచి - చికిలిగా దరువు బాడెడునట్టి!
పల్లెపడుచులు-వెతలఁబడకుండ పోవోయి 18

'పట్టుకోమ్మని' వెంటఁ
బడి పట్టఁబోవఁగాఁ
బరువెత్తు జవరాలివోలీ దుమిదుమికి
పోవు గోదావరిని వ్రాలీ యడుగరా!
సీతమ్మ యడుగు దనచెంతఁ గదపడినప్పు
డెంతగాఁ బులకించి - యేమేమి తలచెనో! 19

కోయకన్నెల వలపు
కూతలో!-కోయిలల
మ్రోతలో! దమలోనగలిసీ పారఁగా
ముత్యాలె నీళులై వెలసీ గోదారి
నీకెదురు వచ్చేని, నాకలోకము నుండి
అప్పుడే దిగివచ్చునట్టి గంగయువోలె- 20

ఏకాంతమునయందు
నెన్నినాళుల నుండి
పాడుకొనుచున్నదో! తానూ వాల్మీకి
రామాయణమ్ము నంతానూ చెవియొగ్గి
వినవయ్య, వాల్మీకి విశదహృదయముబోలు
జాహ్నవీ వేదనాశబలితము - రామకథ - 21

ఎన్ని త్రేయుగము
లిటు బాఱుచున్నదో
అలంత జెందని వృద్ధగంగా మణిఖచిత
భూషణాయిత బహుతరంగా ఆమె యం
కమునందు మునిబాలకలు యొకానొకనాఁడు!
నేఁడు నాగరికతా నిహ్నవిత మానసులు! 22

పూర్వ చాళుక్యులకు
పోషణింపగు రాజు
ఆంధ్ర భారతకవిత నేలీ చంపించె
నంటసుతు! కామమ్మ గ్రోలీ కట్టుకత
లైనవో! ప్రశ్నింపు మందు నిజమున్నదో!
తెలుఁగు కీరితి మరక దోలుత మీనాఁడైన- 23

'నన్నయ్య' తనకవిత
కెన్ని తపములు జేసి
తెన్గువేదము వ్రాసినాఁడో! తననీర
మెన్నిదినములు ద్రాగినాఁడో! మఱచేవు
పృచ్ఛసేయఁగ-నెందరెంత యత్నించినా
నన్నభట్టుల త్రోవ నందికొననే లేదు- 24

'కటకంబు' గాల్పంగ
కాల్దన్న తఱిమినది
యొకనాడు 'భువనవిజయంబూ'[1] తనతీర
మునను 'కుంతలము'[2] సైన్యంబూ గజరాజు
కలఁగి పఱచిన తెన్గుకత్తి వెన్నెలముంపు
తేలాగు విరిసెనో యెదపైని! యడుగురా- 2

1. కృష్ణరాయల సభకు పేరు. ఇక్కడ యీ పదముచే రాయలు ఉద్దిష్టుడు.
2. విద్యానగర రాజ్యమునకు 'కుంతలదేశ' మని పేరు.

'భవభూతి' కవితలకు
ప్రాణ సమ్మితమైన
'పాపికొండ'లలోన నిలచీ చిల్వా గు
బ్బెతల కన్నుల నీటువలచీ జఘనంబు
పైవల్వ దొలఁగినటు వలుద కుసులుల వోవు
గౌతమీ సౌందర్యగరిమ గన్నులఁజూడు - 26

పట్టపగలైన యిరు
లుట్టిపడు కాననము
లందు నీవు చరించువేళా అడివి పూ
వులతావి నినుగుప్పుచాలా యిప్ప క
ల్లున మత్తుగవిసికొని యున్మద ద్విరదంబు
లుట్లున్న, కోయదొరలా కొండదారులను- 27

కలిసికొని దావాగ్ని
కాళ్లు గాలఁగఁ బాఱు
పిడియేనుగుల నుపేక్షించీ పోఁబోకు
మాన్పు మాయగ్ని వర్షించీ యున్నతుల
సంపదలు, దీనార్తిశమ నైకఫలములని
ఘనుఁడైన నీకుఁజెప్పనువలంతినె నేను ! 28

సెలకన్నె లందముల
నెలవైన నినుజూచి
కౌగలింపఁగ గోరునేమో విత్తమైన
తలఁపంచు నిట్టూర్చునేమో వారిహృద
యములలో హత్తుకొని యానందమునుబొంద
నీడమైనను సుంతనీటఁ బారింపరా- 29

వయసు రూపైనట్టి
వగలు కుచములు గులుక
సెలకన్నియలను ధరియించీ    తిరుగు కో
యల కన్నియలను దృష్టించీ    మెచ్చాడి
పోవలయు నేస్తమా! పుడమిపై నందంబు
వారియందేగాని వేఱెచ్చటను లేదు - 30

౯

వాయుపూరిత వేణు
వర్గముల సంగీత
భంగులకు ననుగుణముగాగా    నర్తించు
నాగకన్నియ లబ్బురముగా    యెడనెడను
ఫణఫలక విభ్రాజి మణి పూగరించోళి,
గప్పగా మొగము నాగాధిపులు ముద్దుగొన- 1

ముఱువైన తలపైని
ముత్యాల ముడితోడ
తెన్నుదేవుఁడు[1] నిలిచినాఁడూ    రామయ్య
వానిమది వింతలకు వీడూ    ఆమూర్తి
సేవించితే చాలు చెప్ప నేటికి సుఖము!
నీవెచూచెదు పొమ్ము నెనరు మెఱపును మఱచి- 2

'చింతాకు పతకమ్ము'
చెలువుతో-మోవిపై
చిఱునగవుతో-నున్నదోయీ!    సీతమ్మ
కరుణయే రూపు కట్టయ్యే    మీవదినె
నాశీర్వదింపుమని యడుగు, నా మాఱుగా
నామెదీవెన మేల్మి యమరులకు దుర్లభము- 3

1. భద్రాద్రి రాముఁడు.

ఒంటిగాఁ జరియించు
చున్న దచ్చట 'శబరి'[1]
సేమమ్ము నడుగవలెనోయీ! నాలుగడు
గులు దూరమైననున్ బోయీ! శ్రీరామ
చంద్రుపాదము గడిగి–జనకుఁ డొక్కఁడు గుహుం
డొకఁడు తరియించి, రీయువిదమూడవ యామె– 4

హృదయ మందొక ముదము
పదములందొక మదము
వింత జిల్గుల బాగులాడీ యెవ్వారి
కంతు జిక్కని చదురులాడీ స్వర్గంబు
నందుండి దిగివచ్చె నవని భాగ్యముబండి
వలఁపు నాగపసాని, తెలుఁగు కిన్నెరసాని–[2] 5

ఏ భావమున నెప్పు
డేమి దలపోయునో!
యెవ్వరికిఁ జెప్పఁగారాదూ దానిమది
నీతిలోకము దెలియలేదూ నీ యదృ
ష్టంబెట్టు లున్నదో! సమయానుగతికముగ
నవరించుకో! రసిక శేఖరుఁడవనిపించి – 6

'కోనసీమ'ను నీవు
గుస్తరించెడు వేళ
నడుగడుగునందుఁ గన్పించూ ఋతురాజు
నరిగాపులై వనములించూ బ్రహ్మ తే
జస్సుతో–వల్లకీ స్వరముతో జటసెప్పు
విప్రులున్నారచట వేలాదిగా నేఁడు – 7

1. ఒకవాగు.

2. 'కిన్నెరసాని' యొకవాగు. ఆవాగుపై 'కిన్నెరసాని పాటల'ను వ్రాసిన
శ్వనాథ'గారి కవితాప్రశంసయు–ధ్వనిమార్గమున నిందు సూచితము.

తిట్లలో తిమ్మయ్య
దీవెనల బ్రహ్మయ్య
భీమకవి బారాడినాడూ రాజునే
బిచ్చగానిగఁ జేసినాఁడూ నొకనాడు
కవుల వాక్యమ్ములే కామధేనువు పొదుగు-
కవుల వాక్యమ్ములే కవిసికొను ప్రళయాగ్ని- 8

తమ్మిపూవుల నుండి
కమ్మ పుప్పొడిరాలి
జలములకు వింత సేయంగా వాలుగలు
మాటికిని వగలు గుల్కంగా కనువిందు
లగునీకు మధుర కుల్యాలు, గౌతమీగంగ
గన్నట్టి బిడ్డలై-లలిత సుభగంబుగా- 9

పచ్చపచ్చగఁ జెలఁగి
ముచ్చటల మాటలగు
తీరభూములఁ దిరుగుచుంద్రూ వేదముల
ప్రోవులనఁగా వెలయుచుంద్రూ బ్రాహ్మణులు
నొసట మూడవకన్ను లసదైన హాలహాల
మును మ్రింగరో! యష్టతనువులను దిరుగరో! 10

అడుగడుగు ననుదోట
లమరు నా భూములం
దెందు చూచిన నాట్యమాడూ ఇందిరా
దేవి - యావాలకముజూడూ యింటింట
కావ్యనాటక శాస్త్రకలనలే! తర్క క
ర్కశ దీక్షితలుసుమ్ము కన్యకా నివహమ్ము 11

అయిన నేమాయె-'రా
యలభూమి' చాతుర్య
జలధి-సత్కళలకును నెలవూ దాని పో
కల తేజులందు రాగలవూ! యింటింట
కలవల్లకీ తరంగాయితము, గానమ్ము
కవితా విలాసమ్ము, కమ్మనగు నాట్యమ్ము- 12

చరణ నూపురఘుణ
త్కరణంబులిరవు కొను
సానులను పేరు ధరియించీ యప్సర
శ్చంద్రముఖు లెల్లెడల మించీ జంకించి
ఝుంకారములు, శశాంకాంకు బెదరింతురట!
అదియె దక్షారామ మందురోయీ! సఖుఁడ! 13

శ్రీనాథ కవిరాజు
సీసపాదమ్ములకు
నడలు నేర్పినవారు వీరూ వీరి క
స్తూరికై తెన్గుజోహారూ నడురేల
భీమేశ్వరస్వామి భృంగిరిటి వెంటరా
ధూర్తుఁడై సానిసందుల గొందులను దిరుగు- 14

కుదురు నిండినయనట్టి
గుబ్బ చన్నుల మీద
ముత్యాల సరులాఘుళింపా వలమాన
తాటంక రుచి చౌకళింపా మెలనవ్వి
సాని యీ సానియై, సంచరించెడునచట
మరుల నృత్యము-జగతిమరులు గొల్పింపగా 15

'గోగులమ్మో'క వెంట
రాగ, 'నూకాంబ'వే
ఓక వెంటఁ దన్ను సేవింపా (శ్రీ) 'మండ
తల్లి' పొక్కిలి గానిపింపా 'మాణికా
దేవి' చన్నొలయగా దేవాధి దేవుండు
వాహ్యాళికై 'మొగిలివాకిట'ను నిలుచుండు- 16

ఆ వేళ గమనించి
యార్ద్రిముగ గర్జించి
ప్రమథులను నాడింపవోయీ! విఘ్నేశు
కుండబొజ్జను గురియవోయీ! యాధార
జరఠారుణాతపచ్ఛాయా పరిష్కృతము
యొకవసంతోత్సవం, బుబ్బించు శ్రీకంఠు- 17

అచ్చమగు మోక్షమ్ము
హెచ్చయిన భోగమ్ము
నిచ్చునట! కాశికావాటీ అందులోఁ
దపియింపఁ, నీ దక్షవాటీ దిచ్చరిగ
బ్రదికినను నీ రెండు బ్రాప్తించి తీరునట!
కాశికెక్కడఁ గలదు వీసమీ గారవము! 18

భువన మోహనమైన
పాలపంపు జవరాలు
మేనకా భాగధేయంబూ హిమవంతు
సిద్ధమైనతపః ఫలంబూ రుద్రాణి
విశ్వేశ్వరునినుండి వేఱ య్యొని చోట
ప్రమథ నాయకతాండవారభటులిచోట - 19

కాలకూట విషాగ్ని
కల్మాషితము గళము
గగనకల్లోలి నీ మా లా శబలితము
జాట జూటము వెల్గుచాలా పార్వతీ
కుచకుంభ పరిరంభ కుట్మలిత వక్షుఁడగు
బాలేందు మౌళి కట భీమనాధునకచట- 20

మందార సుమమధుర
మధుమ్మృత నేత్రుఁడై
యొకదిక్కునాడ భైరవుఁడూ వేరొకట
నర్తింప మత్తుఁడై గుహుఁడూ ప్రమధు లిఱు
తట్లు జంకింపఁగా - దా రు కా వ న విటుఁడు
ప్రియురాలి చిఱుబంతి పసుపు లంటిన శివుఁడు- 21

పారావత పతంగ
పాదపాటల జటా
ధమ్మిల్ల సౌభాగ్యశాలీ యిప్పకలు
దనివోవఁగాఁ దానుగ్రోలీ తకథయ్యి
థై థయ్యితకధిమిత, తాండవము లాడునట!
ఆడురా తాఁడవం బాంధ్ర దేశమునందు - 22

మౌళిద్యు విస్ఫుర
ద్బాలేందు నవసుధా
స్వేదపంకిల గండపాళీ పార్వతీ
మధురాధరాస్వాద శీలీ పరశివుఁడు
పుక్కిలించిన కల్లు పుడమి నల్గడఁజిమ్మి
ఆడునట తాండవం - బచ్చరల మెదగ్రుమ్మి- 23

దక్షిణాపథపణ్య
తరుణీ విశద దంత
వజ్రనిభకల్ప సుమమాలీ అప్సరో
గండానుబింబముల దేలీ రతిరాజు
సెలసు విండులు బొమలు మెలఁపుతో నాడించి
ఆడునట! హైమవతి యానందములరూపు - 24

ఈశునకు నీ సేవ
నెట్లు చెల్లింతువో!
ఆ వేళఁ గామరూపుఁడవూ నీకేను
వచియింపఁగా నౌనా! యురవూ సర్వాంగ
ములయందు నీ పూజ సెల్లవలె భర్గునకు-
అన్ని తొడవులు నీవయై యప్డు వెలయవలె - 25

సప్త గోదావరము
సందర్శనము సేసి
కాని పోరాదురా మునుమూ యాగంగ
యాశీస్సు, కల్పతరువనమూ భీమేశ్వ
రునకు నాదేవిపై మనసెంత యున్నదో
భక్తసేవిత జటాబంధమే ప్రకటించు - 26

వీరులకుఁ దొలివీఁడు
'కోరుకొండ'ను జూచి
కనులు సార్థకమౌను నీకూ భావుకుఁడ
వదిజూడకుండ పోవాకూ సులతాను
దక్షిణాపథమునకు దండు పారించెనట!
ఆనృపులు బోరిరట! యంతకుల రూపులై- 27

ఏలేశ్వరా చార్యుఁ[1]
డెట్టివాఁడనుకొంటి
గురువునకు గుండె గుభులనునా అతడంటె
శాస్త్రములె జోహారు లనునా విప్రులకు
నాఁడు[2] తేర్పఱచె మున్నాతఁడే, యామాట
మార్పడని వేదమ్ము మంచికో! చెడ్డకో! 28

ఏ లే శ్వ రు ని బిడ్డ
యిలఁదిరుగు భారతీ
దేవియట! నాడు దేశానా పండితులు
జిత దర్ప లామె దర్పానా హైందవము
స్త్రీ జాతి కొక మేలు సేయనే లేదంచు
తెలిసి తెలియనియట్టి దుర్విమర్శలు నేడు- 29

వీరభద్రుని కరా
మూరి గడిగిన గాత
మీ గంగ నంటిపోవోయీ 'పట్టిసము'
చూడకుండనె పోవకోయీ ఆ భూమి
స్వర్గఖండమ్ము, పంచారామ మా నిసీ
పంచాస్త్ర కేళికా ప్రమదాతిరేకమ్ము- 30

'వరి గింజనొకటఁ బ
ల్వురుసఁ దోమెడువారు'
గలరందు మేఖలావతులూ కుచభార
దర్ప శిథిలిత ధైర్యహారులూ దీర్ఘదీ
ర్ఘము లైనయవ్వారి కడగంటి చూపులకు
బాత్రుఁడవుగాకున్న బ్రదుకేదిరా! సఖుఁడ!- 31

---

1. రాజమండ్రికడ 'యేలేశ్వర' మీతని యూరు. మహావిద్వాంసుఁడు.

2. బ్రాహ్మణులలో 'నాఁడుభేదము' తేర్పడుట కితఁడే కారణమందురు. అందుకు సంబంధించిన యొకచిత్రమైనకథ యితని జీవితమున గలదు.

సత్యనారాయణుఁడు
చదురు దీర్చినతలం
'బన్నవర' మొకటి గన్పించూ ఆచోట
మందమందముగఁ బయనించూ దేవాధి
దేవుఁడగు నా స్వామి దృష్టి శీతలమైన
గోసమెత్తి కొనంగ-వాసవుఁడు నిల్వఁడట! 32

పోవపోవఁగఁ దెర్వు
ముందుఁ గన్పించురా
తల నెత్తి 'సామర్లకోటా' 'తాండ్రపా
పయ్య' కదనపు రాచబాటా విన్పించు
తొలుదొల్త నచ్చోట తోయదా! తెన్గులకు
తెగులయ్యె మచ్చరము దేశచరితలయందు 33

కడుపు మమతను గోసి
యెడఁద త్యాగమూముదూసి
కందుఁ బంపించె 'మల్లమ్మా' పుట్టిల్లు
కాచునని పేరాసగ్రమ్మా దైవమే
దలఁచెనట పెఱదారి! తాను దప్పించునా
పతిలోకముల కేగఁబయనమగా 'మల్లమ్మ! 34

బొబ్బరించెడు పెద్ద
బెబ్బులులు బొబ్బిలిని
కదనాన కత్తులను వ్రాలీ మరణించి
రా వీరులెన్నఁడో పోలీ కాలాన
చచ్చిరా! నేటికిని జానపద గీతికల
జీవితులు-చాగమ్ము చావదే కాలాన- 35

తాళీ వనమ్ములను
తట్టుకొని మెలగాలి
పొలయు కమ్మని నేలలందూ కడియాల
రవళి చిమ్మెడు పాటలందూ పోవోయి
జలదమా! త్రోవలో జాగుసేసేవురా!
వలఁపు దెలియని వాడవా! చేయవనుకొందు 36

గములు గట్టిన కుడుం
గములతో–కాయమా
నములతో – రాజనలతోనూ విరియు పు
ష్పములతో–పుప్పొడులతోనూ నీ త్రోవ
సౌందర్యములు వెన్నుచఱచి నట్టుండులే!
సాఁగవోయీ! శంపనొక చెంపనొత్తికొని- 37

'కాకినాడ'ను జూచి
కాని బోవలదురా!
కాసంత చుట్టుకొనినైనా నన్నెంత
కలికి విరహము గాల్చుచున్నా కల్లోల
మాలికా బంధురము సింధుతీరమునందు
మరులుగొని పారాడు మదవతీ నిచయమ్ము- 38

ఆ 'కుమారారామ'
మందుండు నేస్తమా!
'రాజనారాయణ' స్వామీ నారికే
ళాసవంబులమత్తు బ్రామీ 'కొమరేరు'
నినువలచి పులినమ్ములను నితంబముచూపి!
కనులఁ బోలిన వాలుగల నీటుదూసీని! 39

'భావనారాయణుఁడు'
ప్రమదంబు నిండార
భాసించు 'సర్పపుర'మందూ య
శమునకది వైకుంఠమందూ అష్ట
రీమంత్రమునగాక స్వామి యచ్చట నుండు
కొమిరె గుబ్బెతల నిక్కు-కొను గుబ్బలయందు

'తుల్యభాగాతీర'
బిల్వాటవీ చారి
చెలఁగి జలిమల యల్లువాఁడూ దారుకా
మానికాంతల వన్నెకాఁడూ మాస్వామి
బ్రదుకు తీరేవేఱు-భస్మమ్ముతో - పాప
తలకట్టుతో-నచ్చరల వెంట తడవాఁడు-

'ఏలేరు'[1] ప్రవహించు
నేపట్టణము ప్రోల
పృథివికిని ముత్యాలపేరూ దుర్గమ్మ
చెలియ .'పీఠాంబ' దేయూరూ నాచోటఁ
గొలువు దీర్చినయట్టి 'కుంతిమాధవదేవు'
నెలనవ్వులకు మ్రొక్క-వలెనోయి! నేస్తమా! 42

హ్రీంకార పీఠికా
హుంకారిణీ దేవి
తమ్మ పడిగమ్ము బట్టంగా హేల 'హే
లానాని, గన్ను గొట్టంగా మృగనాభి
హాలాహలాహారి యఱత నిండుగఁబూసి
చరియించు దేవవేశ్యా భుజంగుఁడు శివుఁడు- 43

1. పిఠాపురము.

'కుక్కుటేశ్వరు'డచట
మ్రొక్కికొని పోవోయి
భూతసంఘము బల్కరించీ          యావీర
భద్రు విక్రమము మన్నించీ          పోకపూ
వుల తావు లలమికొను పొలములను గలుగుండ్ల
వలె నున్న పనసపండుల వనమ్ములుదాటి -          44

౧౦

వలపుఁ బొన్నలనీడ
లలమికొను చోటులం
దెలమితోఁ బల్లవులఁ జేరీ          మందార
మద్యంపు మత్తుచేకూరీ          చుంబన
శ్రీవిరాజితలైన చెలువ లుందురు వారి
సురతోత్సవమ్ములకు భరతమ్ము పాడవలె-          1

'తుని' జూచికదలరా!
వనదమా! యాయూరి
తమల పాకులఁ బోలునట్టీ          చెక్కిళులు
బ్రమయ నవ్వులు ముద్దుగట్టీ          తిరిగెదరు
వనజాక్షులచోటఁ బ్రణయ కలహమ్ములకు
నెనసేవు! "తుని" జగడమెంతకును దెగనిదట          2

ఇక్షువనపాలికల
కెలమి చెక్కులుదడిపి
వలపు 'నవకాపల్లి'! దాటి          పిచ్ఛిల ఫ
లశ్యామ వనములనుదాటీ          తొందరగ
పదవోయి! సింధుజల భరిత పవనాంకూర
చలితాల కుండవై జలదాన్వయ శిరోధీ!          3

మృదు 'లవంగీ' లతా
మదిర నేత్రా పుష్ప
గండముల నలనల్ల దడిపీ
శ్రాంతిసమ మొక తాంతి నుడిపీ కన
యేలాలతావార బాలాతతి పరాగ
పటములను దోలఁగించి భావములు గరగించి-

పదవోయి! జలదమా!
మదమంద గమనముగ
పథికాంగనలు నెదురు రాగా
చూపులకు నీ యెడఁద గరుగా
లావళీరమ్యమ్ము లతిగాఢ; మాకంద
వనతుందిలములైన పసిమి తెర్వులఁబట్టి-

మధుర మర్మరగాన
మసృణ తాళీపాళి
చుళికితములగు స్రోవలందూ తి
గనులున్న భాగ్యమ్ముగందూ
శాసవంబుల గ్రోలి యందుందుఁ దిరుగాడు
చిదిమినను తిమురుపిచ్చిలెడు పడఁతులఁ జూచి-

ఆ వరాహ నృసింహు
లవతరించిన చోటు
గనుగొందు సింహాచలమ్మూ తెన్గు దే
శమునకది వెలలేని సొమ్మూ అందుకొ
న్నట్లుండు భూదేవి కందంపుఁ జీరగా
సాగరంబచ్చోట, సగరపుత్రులకీర్తి 7

ప్రణయశీతల మకూ
పారమందా నిలము
పొలసి పత్రములు కెదుకంగా చిఱుసిగ్గు
వలెనె తేనియలు జాఱంగా రతితాంత
లైన రమణులఁబోలు నరటి గుంపులయందు
నిలిచి పొమ్మొకసారి సీరదా! తడిచిలికి- 8

బొందులో మాలియల
యందంబు గూడ నొ
ప్పారుచుండెడి గెలలవ్రాలీ సోడుము
ట్టంగఁ దత్ఫలరసముగ్రోలీ మధుకరీ
ప్రకరంబు షడ్జమగ్రామంబు నందించు;
వినిపించు కిన్నరీవితతి గానమ్ములకు- 9

దమకుఁ దామైపగిలి
తడితేనె కాల్వలగు
పనసపండు తోపులందూ మామిడుల
విరిసివిచ్చిన నీడలందూ చారప
ప్పులుమెసవి మోహంబులెసవి క్రీడింతురట!
అలఁత గదురని నాగులై యాటవిక గణము- 10

నెమలి కుచ్చులుజోపి
నెత్తిపై - ధాతురా
గములు చన్నుల దోయిబూసీ కాళ్ళలో
గోరంట పసరు గైసేసీ చరణములె
వాల్గన్నులై - సముజ్జ్వల దీపమై మరులు
నిశిదిరుగు కోయలకు నీమెఱపుఁ దోడంపు- 11

ఆ వరాహ నృసింహు
నడుగులకు ప్రొక్కికొ
మ్మతఁడు చందన దిగ్ధమూర్తి యాటవిక
సుందరీ నిభృత విరహార్తి యెన్నిరా
జ్యమ్ములో యెలసినవి పొలసినవి కాలాన:
సింహాచలస్వామి చెక్కుచెదరనేలేదు- 12

ప్రబల 'కన్నడరాయ'[1]
పౌరుషము రూపెత్తి
శాసనం బై నదటచూడూ ప్రక్కగా
స్తంభమున నేడద్ది పాడూ జంటరా
ణులతోడ రారాజు తలనువంచిన మహం
బప్పుడెంతఁగఁ బులకలలమెనొ నృకేసరికి! 13

తెలమలపి చూచుచును
దొలఁగి పారినరాజు
గజపతిని దాగటాక్షించీ ససినేది
నట్టి విక్రమధాటి నెంచీ సింహాచ
లస్వామి నవ్వెనో లక్ష్మి చంచలతకై!
తడవ కొకరూపైన తనలోకలీలకై- 14

మతిలో బృహస్పతులు
మంత్రి తిమ్మరుసయ్య
వీరచందనము భాసింపా తలవంచి
'నీకరుణ' యంచు సేవింపా సేవకై
సమ్మతించెనో స్వామి! చందనచ్ఛలములతో
నవ్వెనో! నవ్వులకు నెన్ని యర్థమ్ములో! 15

1. కృష్ణరాయల శాసన మీ కోవెలలో నొక కంబముపైఁ గలదు.

శ్రీ వైష్ణవామ్నాయ
సిద్ధాంత శుభమూర్తి
లక్ష్మణానుజు[1] లిటకువచ్చి    యీస్వామి
దరిసించి–మరులులో నెచ్చి    పాడెనట
వేదసూక్తులు! యెన్నివేల యుగములనుండి
చెంచుకత్తెలకు నాశించి నిల్చెనో స్వామి! 16

శ్రీసుదర్శన గర్జ
చెలఁగినటు గర్జించి
స్వామికై ముడుపు చెల్లించీ    పదవోయి!
నాదు కష్టంబు మన్నించీ    ముంతమా
మిడుల తావులుక్రొత్త గడుకొన్న దారులను
కడువడిగ వర్షించి – కలుగు దూరంబెంచి – 17

ఆనంద గజపతుల
యశము విచ్చినతోట
విజయనగరము దోచునీకూ    "గంటకం
బము" జూడకుండ పోబోకూ    గీర్వాణి
యాయూర లాస్యంబులాడు నిప్పుడుగూడ
సకల కళలకునద్ది చదుకోయి! నవజలద! 18

లీలగానట "వాయు
లీన"మై యేప్రొద్దు
గానమ్ము వాహ్యాళిదిరుగూ    పండితుల
శాస్త్రచర్చలలోని మెఱుఁగూ    చూడవలె
నచ్చోటనే వనదమా! వారసుందరీ
తరళవీక్షలలోని తళుఁగు మెఱుఁగులుగూడ– 19

1. భగవద్రామానుజులు

"బూచి" యని నంతనే
లేచి చూతురుగదా !
పసివారు తెన్గుదేశానా ఆ దొర వి
హారమ్ము నాఁడీతలానా "విజయరా
ముఁడు" పాముకున్న దేమున్నదిర! కాలాన
పోలివాని యపకీర్తి నిలుచు టొక్కటిదక్క 20

వీర బెబ్బులి చూచి
పోర! మార్గమునందు
నామమ్ము వీరగంధూళీ వర్షింపు
మచ్చోటఁ గ్రిందుగా వ్రాలీ తాండ్రపా
పయ్య హుంకారమ్ము పరిఢవిల్లునో యేమొ!
నీగర్జ బురుడించి – నీ మెఱపు వెఱనించి 21

అదెవచ్చె నాదుప్రియు
రాలున్న యాచోటు
శ్రీకాకుళము దాని పేరూ ఒక నదీ
తీరాననున్న దాయూరూ గజపతుల
యశము బారాడునట నందందు–కాలాన
చెదరినా – అఱచేత జీవమ్ములనుబట్టి – 22

సుందరమ్ములు చెలఁగు
మందారములు రెండు
మా పూరి గుడిసె మున్ముందూ అది యొకటె
మాఱిపోవనిది గుఱుతందూ తానగుచు
జలములనుబోయు నాసరసాంగి వానికై
మా ప్రణయ సాక్షులని–మనసులో చెలిమెంచి– 23

శ్యామాంగి, మధురాక్షి,
చక్కనగు తీరు లది
మీ వదినె యుత్ప్రేక్ష లేదా వెఱ్ఱిబా
గులది చాతుర్యవతిగాదా అన్నంబు
ముట్టెనో! నా విరహమున గడుపు గట్టెనో!
గుర్తుచిక్కెనో లేదో! కుసుమసమ మామనసు 24

తలిదండ్రు లెంతఁగా
బలుకరించిన నొక్క
బదులాడి యెఱుగదనుకొందూ యెడబాటు
కన్నీటి పాయ యనుకొందూ యేక వే
ణీభరముతో సలిల నిభృతాక్షి యీవైపె
చూపౌసఁగి నిరతంబు చూచుననుకొందురా— 25

'నీమగని జూచితిని
నిలచి యున్నాఁడ'నుము
'వచ్చున'ను వేగమే తిరిగీ దాని మరు
లెచ్చరింపఁగ మనసు కరగీ తనమీఁది
తలఁపె నా కిచ్చోటఁ జెలికత్తె యనుము—నా
దినములిక దాపురించినవి – తడ లేదనుము 26

'ముద్దుగొన్నా'ననుము
నిద్దంపు దన ప్రేమ
జీవితంబనుము కాలమ్ము గడచినది
గడువ వలయునది లేశమ్ము తొందరగ
తుదముట్టు నను మోయి తోయదా! మన బ్రదుకు
శబలితము సృష్టి నేకాంత సౌఖ్యము లేదు – 27

తొందరగఁ జనవోయి!
తొయ్యలిని గనవోయి!
దినదినము నాకొక్కయుగమూ అలదాని
చింత దినివేసె నాయుగమూ తానేమి
జెప్పనో! యామాట నప్పుడే గ్రహియించి
మరలవలె తమ్ముఁడా! తెరువునను జాఁగణచి 28

వేయి గన్నులతోడ
వీక్షించు చుందురా!
నీవచ్చు మార్గమ్మునందూ పోవోయి!
ప్రాణరక్షణ ఫలముగందూ తమ్ముఁడా
హనుమంతుఁ డొక్కనా డార్ద్రహృదయుడు దూత;
నీవొకఁడ వీ నేడు - నెనరు గల్గిన దూత - 29

కదలినది మేఘమ్ము
కదలినది ప్రణయమ్ము
పూవులుగ జలము వర్షించీ మంద్ర సుం
దర రీతిగాఁగ గర్జించీ యాగర్జ
సమ్మతిఁగఁ దలపోసి సంతసించెను ఖైది
కదలినది మేఘమ్ము-కలవోలి రూపమ్ము-

చిర విరహమున కొక్క
గుఱుతుగాఁ బ్రేమికుఁడు
నిలిచి కొన్నాఁడు శూన్యానా ప్రియురాలి
యెడబాటు గ్రుమ్మహృదయానా- తోదయము
కదలినది నాక భూ క ల్ప మాలాకల్ప
మై-గగనమునకొక్క యాకల్పమైతాను- 3

ఏ తెర్వు బట్టునో
యింతకును మేఘమ్ము
జవరాలిఁ జూచునో లేదో! చూచినను
యీమాట చెప్పునో లేదో! చెప్పినా
యీభాష లామగువ కర్థమౌనో లేదో!
కదలినది మేఘమ్ము-కాంతిపో వితానమ్ము- 32

—: o :—

**MEGHA DUTAMU**

**By Puttaparthi**

Rs. 10-00

---

అనేక భాషలు జీర్ణించుకొన్నవాడు, అనేక సాహిత్యములు ఆకళించుకొన్నవాడు, భారతదేశ మంతయును తిరిగినవాడు, వేల సన్మానము లందినవాడు, సంగీత సాహిత్యము లలో దిట్ట, అతులిత శేముషీ విభావతుడైన వక్త, సాహితీ మహామేరువు, నూటికిపైగా గ్రంథములు వ్రాసినవాడు, వ్రాసిన పంక్తి అంతయును వెల గల వాడు, సాహిత్యములో అన్ని పోకడలు పోయినవాడు, గతమును మరువనివాడు, భావి నాహ్వానించినవాడు, భావుక చక్రవర్తి, బహు భాషల కాధార ప్రదానము లొసగినవాడు, శివానంద సరస్వతితో "సరస్వతీ పుత్ర" బిరుదు నందినవాడు, "మహాకవి" అని జనులచే గౌరవింపబడినవాడు, ఇటీవల "పద్మశ్రీ" బిరుద మందినవాడు, పుట్టపర్తి నారాయణాచార్యులవారు.

ఆతని రచన చదవండి!

---